# ఒక మాట
# మూడు గ్రంథములు




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org





# ఒక మాట

# మూడు గ్రంథములు


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (64) చతుష్షష్ఠాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–37 ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి–2016

ప్రతులు : 1000 **వెల : 45 /-**

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

### ఇందూ జ్ఞానవేదిక మరియు ఇతర సంఘముల ప్రచురణలు

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
**71) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**72) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**73) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**74) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**



### ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

### సువార్త క్రైస్తవ సంఘం

1. సువార్త బైబిలు. 2. దేవుని మార్గము-మన ప్రయాణము.
3. మత్తయి సువార్త మర్మాలు. 4. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
5. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము. 6. పాప క్షమాపణ ఎలా కలదు?

### ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

### రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక, ఆధ్యాత్మిక ప్రసంగములు

***DVD'S***

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-
లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-
మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక, ఆధ్యాత్మిక ప్రసంగములు

*DVD'S*

56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
    కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
    తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
    రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
    అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము.
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
    మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది.
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం,
అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968,
92900 12413, 94406 01136.

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 8185020272.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి,దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
తెలంగాణ రాష్ట్రం, Cell:94910 40963,
90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా.
Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి టౌన్,
చిత్తూరు జిల్లా.
Cell : 9491773455, 9032903955.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు జిల్లా.
Cell : 9494618322, 8374923363

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్ర.సభ్యుడు)
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell : 9849883261, 8142853311,
8187084516.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి
(మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ,
మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815,
9440655409, 9701261165.

**యం. మురళి**
క్రొత్త బస్టాండు ప్రక్కన, జడ్చర్ల,
మహబూబ్‌నగర్ జిల్లా.
Cell : 97057 16459

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)**
(ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
సీతానగర్, భువనగిరి టౌన్,
నల్గొండ జిల్లా. Cell : 7680065963
9704885964, 9848141703.

**వి. దుర్గావరప్రసాద్**
భవానీ నగర్, కోదాడ టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9963287001, 9866357001.

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణా ఫార్మా, కాలేజీ రోడ్,
హోస్పేట, బళ్ళారి జిల్లా,
కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

# ఒక మాట మూడు గ్రంథములు

సృష్ట్యాదిలోనే దేవుడు తన జ్ఞానమును ఆకాశవాణి ద్వారా తెలియ జేశాడు. ఆకాశములో శబ్దమైవచ్చిన దైవజ్ఞానమును ఆకాశములోనే యున్న సూర్యుడు విన్నాడు. దేవుడు సూర్యునికే తన జ్ఞానమును మొదట తెలియజేశాడు. శబ్దరూపములో వచ్చిన జ్ఞానము శబ్దముగానే అణిగి పోయినది. ఏ శబ్దమయినా శూణ్యములో కలిసిపోయి వినిపించకుండా పోవును. మనిషి మాట్లాడు మాట యొక్క శబ్దము మనిషినుండి కొంత దూరము ప్రయాణించి వినిపించకుండా అణిగి పోవుచున్నది. సృష్ట్యాదిలో ఆకాశము నుండి పుట్టిన శబ్దము కొంత దూరము ప్రయాణించి అణిగి పోయినది. సూర్య గ్రహమునకు దగ్గరగా పుట్టిన శబ్దమును సూర్యుడు వినగలిగాడు. ఆకాశము ద్వారా చెప్పబడిన జ్ఞానమును లేక మాటలను అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్‌లో **"వహీ"** అన్నారు. 42వ సూరా 51వ ఆయత్‌లో "వహీ ద్వారా చెప్పబడును" అని కలదు. అనగా శబ్దము ద్వారా దేవుడు జ్ఞానమును తెలియజేయునని అర్థము. మతములు, మత గ్రంథములు వచ్చిన తర్వాత ఇస్లామ్ గ్రంథమయిన ఖురాన్‌లో 'వహీ' అన్నారు. 'వహీ' అనగా ఆకాశ శబ్దము ద్వారా వచ్చిన మాటలని అర్థము. సృష్ఠిని ప్రారంభించిన తర్వాత మొదటనే దేవుడు ప్రజలకు తన జ్ఞానమును తెలియజేయు నిమిత్తము ఆకాశములో శబ్దమును పుట్టించాడు. ఆ శబ్దము కొంతవరకు ప్రయాణించి వినిపించకుండా పోయినది. అప్పుడు వచ్చిన శబ్దమును ఆకాశములోని సూర్యుడు వినగలిగాడు.

అప్పుడు ఆకాశవాణి ద్వారా చెప్పిన జ్ఞానము సూర్యునికే చెప్పబడినది, కావున సూర్యునికి దగ్గరగా శబ్దము పుట్టి సూర్యుని వరకు ప్రయాణించి అణిగిపోయినది. అందువలన మొదట ఆకాశమునుండి

శబ్దము ద్వారా వచ్చిన జ్ఞానమును సూర్యుడు మాత్రము వినగలిగాడు. సూర్యుడు వినిన జ్ఞానము ఐదు వేల సంవత్సరముల పూర్వము మొట్ట మొదట గ్రంథముగా మారినది. అదియే **"ప్రథమ దైవ గ్రంథము".** తర్వాత కొంత కాలమునకు ద్వితీయ దైవగ్రంథముగా తయారైనది. ఆ తర్వాత కొంత కాలమునకు అంతిమ దైవగ్రంథముగా కూడా తయారై వచ్చినది. గ్రంథములు మూడయినా, గ్రంథములు వేరువేరుగా యున్నా, ఆ గ్రంథములలో దేవుడు మొదట సూర్యునికి చెప్పిన జ్ఞానమేయున్నది. సూర్యునికి శబ్దరూపములో చెప్పిన జ్ఞానము, శబ్దము అణిగిపోతూనే ఎవరికీ తెలియకుండా పోయినది. ఆకాశములో పుట్టిన జ్ఞానము ఆకాశములోనే అణిగిపోయినది. శూన్యములో పుట్టి, శూన్యములో కలిసి పోయిన జ్ఞానమును ఆ దినము సూర్యుడు విన్నాడు, కావున అది సూర్యునిలో సజీవముగా నిలిచిపోయినది. తనయందు నిక్షిప్తమైయున్న జ్ఞానమును సూర్యుడు భూమిమీదగల మనుషులకు తెలియజేశాడు. అలా తెలియ జేయబడిన జ్ఞానమే నేడు దైవగ్రంథముల రూపములో మనముందర యున్నది.

దేవుడు చెప్పిన జ్ఞానము గ్రంథరూపమై మనముందరున్నమాట వాస్తవమే అయినా, అందులో మనుషుల వ్రాతలు కూడా కొన్ని కలిసి యున్నాయి. దేవుని జ్ఞానము ముందర వాటిని జ్ఞానులయిన వారు సులభముగా గుర్తించవచ్చును. అయితే భూమి మీద పుట్టిన తర్వాత మనుషులు జ్ఞానమును తెలియుచుండుట వలన గ్రంథములలో కలిసిన మనుషుల వాక్యములను కూడా దేవుని వాక్యములే అనుకొనుచున్నారు. ఎవడయినా గానీ ముందే జ్ఞాని అయినవాడు, అనగా దైవగ్రంథమును చదవకముందే పుట్టుకతోనే జ్ఞాని అయినవాడు, గ్రంథములో కలిసిన

మనుషుల వాక్యములను గుర్తించగలడు. అందరూ పుట్టిన తర్వాత జ్ఞానులగుటకు ప్రయత్నించువారే అయినందున దైవగ్రంథములలో కలిసిన మనుషుల మాటలను గుర్తించలేకపోవుచున్నారు. దేవునియొక్క స్వచ్ఛమయిన జ్ఞానము కావాలను వారికి దేవుడే తన జ్ఞానమును వడబోసి, స్వచ్ఛపరచి మనకు అందివ్వగలడు.

దేవుడు శబ్దరూపములో చెప్పిన జ్ఞానము మూడు యుగముల తర్వాత గ్రంథరూపమైనది. మూడు యుగములు గడచిపోయి మూడవ యుగము చివరిలో, నాల్గవ యుగము మొదటిలో దైవజ్ఞానము ప్రథమ దైవగ్రంథముగా తయారయినది. ప్రథమ దైవగ్రంథమునే భగవద్గీతయని చెప్పడమైనది. మొదటి యుగములో మొదటనే చెప్పబడిన దైవజ్ఞానము కలియుగము ప్రారంభములో గ్రంథముగా వ్రాయబడినది. మూడు యుగముల వరకు గ్రంథరూపము కాలేదు. గ్రంథరూపమైన తర్వాత పేరు పెట్టబడినది. గ్రంథ రూపము కాకుండా యున్నప్పుడు దేవుడు చెప్పిన శబ్దరూపమైన జ్ఞానమునకు ప్రత్యేకమయిన ఒక పేరు ఉండేది. దేవుడు చెప్పిన జ్ఞానము సృష్ఠించబడిన ప్రపంచమునకంటే వేరుగా యుండుట వలన అదే అర్థముండునట్లు చెప్పేవారు. **"జ"** అనగా 'పుట్టడము' అని అర్థము. **"పర"** అనగా 'వేరుగా యున్నదని' అర్థము. పుట్టిన దానికంటే వేరుగా యున్నదను అర్థము వచ్చునట్లు వాణి (శబ్దము) ద్వారా వచ్చిన జ్ఞానమును **"జపర"** అని పిలిచెడివారు. గ్రంథరూపము కాని జపర జ్ఞానము మూడు యుగముల తర్వాత "భగవద్గీత" యను పేరుతో ఐదువేల సంవత్సరముల పూర్వమే తయారైనది. మొదట "జపర" అని పిలువబడిన జ్ఞానము గ్రంథముగా తయారయిన తర్వాత దానిని ప్రథమ దైవగ్రంథమని చెప్పారు.

ప్రథమ దైవగ్రంథములోని జ్ఞానము గ్రంథరూపము కాకముందు "జపర" అను పేరుతో పిలువబడేది తర్వాత ప్రథమ దైవగ్రంథములోని జ్ఞానమే ద్వితీయ, అంతిమ దైవగ్రంథములుగా రూపుదిద్దుకొన్నది. జపర అను శబ్దరూపమై వచ్చిన జ్ఞానము భగవద్గీతగా మారగా, తర్వాత రెండు గ్రంథములుగా వచ్చినది. అందులో చివరిది అంతిమ దైవగ్రంథము.

దేవుడు గ్రంథరూపములో మనుషులకు ఇచ్చిన జ్ఞానము ఒకటే అయినా, అది మూడు గ్రంథములుగా కనిపించుచున్నది. దేవుడు ఇచ్చిన గ్రంథజ్ఞానమును 'ప్రథమ', 'ద్వితీయ', 'అంతిమ' అను పేర్లతో చెప్పు కొంటున్నాము. ప్రస్తుతము అంతిమ దైవగ్రంథములోని జ్ఞాన వాక్యములను గురించి ప్రస్థావించుకొనుచున్నాము. దైవగ్రంథములో దేవుని విషయములే ఉండును. దేవుని విషయములనగా 'దేవుని జ్ఞానము' అని అర్థము. అంతిమ దైవగ్రంథములో 'జపర' అను పేరు నేటి మనుషులకు పూర్తి క్రొత్త పేరుగాయున్నది. మేము ఈ పేరును కల్పించి చెప్పినట్లు చాలామంది అనుకొను అవకాశము గలదు. అయితే మా మాట నిజము అనునట్లు 'జబుర' గ్రంథము పూర్వము ఉండేదని కొందరు ముస్లీమ్‌లు చెప్పుకోవడము చూశాను. గ్రంథములు నాలుగు కలవని ఒకటి జబుర, రెండు తౌరాతు, మూడు ఇంజీలు, నాలుగు ఖురాన్ అని చెప్పుచుందురు. అయితే 'జపర' అను పదము కాలక్రమమున 'జబుర' గా మారినదనీ, 'జబుర' అనునది వాణి (శబ్దరూపమైన జ్ఞానము) మాత్రమేయని వారికి తెలియదు. జబుర అని చెప్పబడునది వాస్తవానికి గ్రంథరూపములో లేదనీ, దాని అసలు పేరు జపర అనీ, 'జపర' శబ్దముగా వచ్చిన జ్ఞానమని మేము చాలామార్లు చెప్పాము. గ్రంథములలో కూడా ఇదే విషయమునే వ్రాశాము.

ముస్లీమ్ పెద్దలు నాలుగు గ్రంథముల పేర్లలో 'జబుర' అని మొదటి గ్రంథము పేరు చెప్పుచుందురు. వాస్తవానికి వారు చూచినది, వారికి తెలిసినవి ఇంజీలు, ఖురాన్ అను రెండు గ్రంథములు మాత్రమే. "తౌరాత్" అను గ్రంథమును కూడా వారు చూడలేదు, అది ఏ భాషలో ఉన్న విషయము కూడా ఎవరికీ తెలియదు. 'జబుర' అనునది గ్రంథమే కాదు. జ్ఞానము గ్రంథరూపము కానప్పుడున్న పేరు "జపర" అనియూ, అదియే కాలక్రమమున 'జబుర' అను పేరుగా మార్పు చెందినదని ఎవరికీ తెలియదు. 'జపర' అను మూడు అక్షరములలో మధ్యలో అక్షరము మారిపోయి 'జబుర' అని పిలువబడుచున్నది. తౌరాత్ గ్రంథమునే ఎవరూ చూడనప్పుడు, గ్రంథమే కానటువంటి 'జబుర' ను ఎవరూ చూచుటకు అవకాశమే లేదు. 'జబుర' అను పేరు వినిన వారుండవచ్చునుగానీ, జబుర గ్రంథమును చూచినవారు భూమిమీద ఎవరూ లేరు. సృష్ట్యాదిలో ఆకాశమునుండి చెప్పబడిన దైవ జ్ఞానమునకు "జపర" అను పేరు పెట్టగా, అది చివరకు 'జబుర' అను పేరుగా మారిపోయినది. అలా పేరు మారడమేకాక అదియొక గ్రంథమను పుకారు ప్రచారమయిపోయినది. పుకారు షికారు చేసినా దానిని చూచిన వారు మాత్రము ఎవరూ లేరు. ఇప్పుడు తిరిగి సృష్ట్యాదిలోనికి పోయి చూస్తాము.

సృష్ట్యాదిలో ఆకాశవాణి ద్వారా దైవజ్ఞానము వినిపించగా, దానిని వినినవాడు ఒక్క సూర్యుడు మాత్రమే. ఆకాశములో భూతములు, గ్రహములు ఎన్నో గలవు. గ్రహములలో ఒకడయిన సూర్యుడు ఆకాశ వాణి నుండి వచ్చిన శబ్దము ద్వారా దైవజ్ఞానమును గ్రహించగలిగాడు. వినిన దానిని గ్రహించగలుగు స్థోమత కలవాడు సూర్యుడు అయినందున సూర్యున్ని 'గ్రహము' అని అనుచున్నాము. 'గ్రహము' అనగా గ్రహించు

స్థోమత గలవాడని అర్థము. సూర్యుడు ఆకాశమునుండి వచ్చిన శబ్దము ద్వారా జ్ఞానమును గ్రహించిన తర్వాత అదే జ్ఞానమును భూమిమీద మనువు అను వ్యక్తికి తెలియజేశాడు. భూమిమీద గల మనువు ద్వారా సూర్యుడు చెప్పిన జ్ఞానము ప్రజలలో ప్రాకిపోయినది. ఇక్కడ కొందరికి ఒక ప్రశ్న రాగలదు. అది ఏమనగా! ఆకాశము తన శబ్దమును సూర్యునికి ఏ భాషలో వినిపించినది? ఆకాశము తన శబ్దము ద్వారా ఏ భాషలో చెప్పగలిగినదో మనము తెలియవలసి యున్నది. అంతేకాక ఆకాశము విశాలమైనది, విశాలమైన ఆకాశములో సూర్యుడు ఎంత పెద్దగాయున్నా బహు స్వల్పముగానే కనిపించుచుండును. అటువంటి సూర్యునికి ఆకాశము ఏ భాషలో చెప్పినది? ఎంతగట్టిగా చెప్పినదను ప్రశ్నలు వచ్చుచున్నవి. ఎంత శబ్దముతో చెప్పారో, ఏ భాషలో చెప్పారో తెలియుటకు అప్పుడు ఏమి జరిగినదో తెలియాలి.

సృష్ట్యాదిలో భాషలే లేవు, ప్రజలు సైగలతో ఒకరి భావమును మరొకరు తెలుసుకొనెడివారు. తర్వాత కొంత కాలమునకు శబ్దముల ద్వారా భావమును తెలియుటకు అలవాటుపడ్డారు. శబ్దములలోనే భాషను తయారు చేసుకొన్నారు. ఇది ప్రజల స్థితి, ప్రజలు ఒక భావమును గ్రహించుటకు ఎంతో కష్టపడెడివారు. ఇక్కడ ప్రజలు ఈ విధముగా క్రమేపీ భాషను తయారు చేసుకోగలిగారు. అయితే సృష్ట్యాదిలో మనుషుల మధ్య భాష ఏర్పడు సమయములో ఆకాశవాణి ప్రజల కొరకు అవసరమైన జ్ఞానమును భాష లేకుండా చెప్పినది. మనము మాట్లాడే ఏ భాషలోనూ ఆకాశము చెప్పలేదు, సూర్యుడు వినసూ లేదు. ఆకాశములో యున్న సూర్యుడు ఆకాశము వలన దైవజ్ఞానమును గ్రహించగలిగాడు. అయితే ఆకాశము మనుషుల భాషలో చెప్పలేదు. ఆకాశము శబ్దరూపములో

తెలియజేసిన దానిని సూర్యుడు గ్రహించగలిగాడు. సూర్యుడు ఆకాశము నుండి వచ్చిన శబ్దమును విని దైవజ్ఞానమును తెలియగలిగాడు. ఆకాశము తన శబ్దము ద్వారా దైవజ్ఞానమును తెలియజేసినా, ఆనాడు ఒక్క సూర్యుడు తప్ప మిగతావారు ఎవరూ తెలుసుకోలేకపోయారు. ఆకాశము ద్వారా వచ్చిన శబ్దమును ఆనాడు ప్రజలు కూడా వినగలిగారు. అయితే ఆ శబ్దము తమకు తెలిసిన భాషలో లేకుండుట వలన ప్రజలకు జ్ఞానము తెలియలేదు. ఆకాశము నుండి వచ్చిన శబ్దము అందరికీ వినిపించు అవకాశము దేవుడు కల్పించాడు. అయినా ప్రజలు తెలియలేకపోయారు. అయితే ఆ దినము ఆకాశము మనుషులకు తెలిసిన భాషలో జ్ఞానమును చెప్పలేదు. తనకు తెలిసిన శబ్దముతో చెప్పగలిగినది. దానిని సూర్యుడు పెద్ద గ్రహమైనందున గ్రహించగలిగాడు. ఆకాశము ఒక్కమారే దైవ జ్ఞానమును చెప్పి ఊరకయుండ లేదు. ఆనాడు చెప్పిన జ్ఞానమును తర్వాత కూడా అప్పుడప్పుడూ చెప్పినది. దేవుని ఆజ్ఞ అమలు పరచు విధానములో, ప్రజలను జ్ఞానవంతులుగా చేయుటకు ఆకాశము ఇప్పటికి కూడా జ్ఞానమును చెప్పుచూనే యున్నది. అయినా అది మనకు తెలియదు.

మొదటిమారు ఆకాశము ద్వారా దేవుడు జ్ఞానమును తెలియ జేశాడు. సృష్ఠి మొదటిలో ప్రపంచము ఏమీ తెలియని చిన్న బిడ్డలాంటిది. దేవుడు తన జ్ఞానమును మూడు విధముల మనుషులకు తెలియజేయుటకు అవకాశము గలదు. ఆ విషయమును తన చివరి దైవగ్రంథమయిన ఖురాన్‌లో సూరా 42, ఆయత్ 51లో ఈ విధముగా చెప్పారు. **(42-51) "దేవుడు ఏ మనిషితోనూ ప్రత్యక్షముగా (నేరుగా) మాట్లాడడు. దేవునితో మనిషి మాట్లాడడము సాధ్యమయ్యేపని కాదు. దేవుడు**

**తన జ్ఞానమును వాణి ద్వారా (వహీ ద్వారా) అనగా శబ్దము ద్వారా తెలుపును. లేదా తెర వెనుకనుండి తెలియజేస్తాడు. లేదా తన జ్ఞానమును తెలుపడానికి తన ప్రతినిధిని పంపుతాడు. ఆయన మహోన్నతుడు, ఎంతో వివేకవంతుడు".** బిడ్డ శిశుదశలో యున్నప్పుడు, తల్లి చెప్పు మాటలను అర్థము చేసుకొను స్థోమత లేనప్పుడు, తల్లి తన భావమును శబ్దములతో తెలియజేయును. తల్లి చేయు శబ్దము భాషగాయుండదు. భాష పిల్లలకు తెలియని దానివలన గిలక శబ్దముతోనో, చప్పట్ల శబ్దముతోనో, నోటితో చేయు శబ్దముతోనో తన శిశువు చూపును తనవైపు వచ్చునట్లు, తనను చూచునట్లు చేయును. అదే విధముగా దేవుడు జ్ఞానమును మనుషులకు తెలుపు మూడు విధానములలో మొదట సృష్ట్యాదిలో ఆకాశ శబ్దము నుండి తన జ్ఞానమును తెలియజేయగా, దానిని సూర్యుడు గ్రహించి కొంత కాలమునకు మనుషులు గ్రహించు భాషలో, భూమిమీద మనువు అను వ్యక్తికి తెలియజేశాడు. అతని ద్వారా సమస్త మానవులకు దేవుడు మొదట తెలియజేసిన జ్ఞానము తెలిసినది. అదే జ్ఞానమే తర్వాత, ఆ తర్వాత రెండుమార్లు చెప్పడమైనది. అలా రెండుమార్లు చెప్పిన జ్ఞానము భారతదేశములో భగవద్గీతగా, ఇజ్రాయెల్ దేశములో బైబిలుగా గ్రంథరూపమైనది. వాటినే అనగా భగవద్గీతను ప్రథమ దైవగ్రంథ మనియూ, బైబిలును ద్వితీయ దైవగ్రంథమనియూ చెప్పుచున్నాము. మొదట తయారైనది కావున భగవద్గీతను "ప్రథమ దైవగ్రంథము" అని అనుచున్నాము. తర్వాత తయారైనది బైబిలు (ఇంజీలు) దీనిని ద్వితీయ దైవగ్రంథమనియూ లేక మధ్య దైవగ్రంథమనియూ అనుచున్నాము. ఈ రెండు గ్రంథములలోని బోధలను దైవ ప్రతినిధులు రెండు వేరువేరు దేశములలో, రెండు వేరువేరు కాలములలో, రెండు రకముల వేరువేరు రూపములలో తెలియజేశారు.

దానివలన దేవుడు ఖురాన్ గ్రంథములో చెప్పినట్లు, తన ప్రతినిధి ద్వారా జ్ఞానము చెప్పునను మాట నెరవేరినది. మొదట వాణి ద్వారా, రెండవమారు తన ప్రతినిధి ద్వారా, మూడవ మారు తెరచాటునుండి జిబ్రయేల్ ద్వారా తెలియచేయడము వలన, తెరచాటు నుండి జ్ఞానమును తెలియజేతును అనుమాట కూడా నెరవేరినది. దేవుడు చెప్పిన మూడు విధానములు నెరవేరినట్లయినది. దేవుడు చెప్పిన మూడు విధానములలో చివరిగా నెరవేరినది 'తెరచాటునుండి తెలియజేతును' అనుమాట అయినందున తెరచాటునుండి చెప్పిన జ్ఞానము గ్రంథరూపమైనప్పుడు ఆ గ్రంథమును 'చివరి దైవగ్రంథము' అని అన్నారు.

ఖురాన్‌ను చివరి దైవగ్రంథము అనుటకు కారణము చాలామందికి తెలియదనియే చెప్పవచ్చును. దేవుడు ప్రజలకు జ్ఞానమును మూడు విధముల బోధింతునని చెప్పియుండుట వలన, ఆ మూడు విధానములలో తెరచాటునుండి చెప్పెదను అనుమాట, రెండు విధానములు అయిపోయి చివరిగా మూడవ విధానమై నెరవేరిన దానివలన, ఖురాన్‌ను **'అంతిమ దైవగ్రంథము'** అనుటకు అవకాశము ఏర్పడినది. ఆకాశవాణి ద్వారా చెప్పబడినది దేవుని ప్రథమ విధానమైనందున, సూర్యుని జ్ఞానము కృష్ణుని ద్వారా చెప్పిన భగవద్గీతయైనా, చెప్పినది ఆకాశముగానే భావించుట వలన, ప్రథమ దైవగ్రంథముగా 'భగవద్గీత'ను చెప్పుచున్నాము. రెండవమారు దైవ ప్రతినిధి చెప్పుట జరిగిన దానివలన 'ద్వితీయ దైవగ్రంథము' అని బైబిలును చెప్పడము జరిగినది. ఈ మూడు గ్రంథములే ప్రపంచమున్నంత వరకు అదే స్థానములో యుండును. ఈ మూడు గ్రంథముల తర్వాత దేవుని జ్ఞానము వచ్చినా, అవి దైవగ్రంథములయినా **"ప్రథమ", "మధ్యమ", "అంతిమ"** అను బిరుదులు ఈ మూడు గ్రంథములకు ఎల్లప్పుడూ

శాశ్వితముగా ఉండును. అంతిమ దైవగ్రంథము ఖురాన్ తర్వాత ఖురాన్‌ను మించిన జ్ఞానము గ్రంథరూపములో వచ్చినా, అది దైవగ్రంథమనిపించు కొనును అంతేకానీ, అంతిమ దైవగ్రంథమను పేరు ఇతర దైవగ్రంథములకు చెప్పుటకు వీలులేదు. అదే విధముగా సృష్ఠియున్నంత వరకు ప్రథమ, మధ్యమ, అంతిమ దైవగ్రంథముల స్థానములో భగవద్గీత, ఇంజీలు, ఖురానే శాశ్వితముగా యుండును.

అంతిమ దైవగ్రంథముగా ఎప్పటికీ ఖురాన్ ఉండును, ఆ స్థానము ఎప్పటికీ మారదు. దేవుడు చెప్పిన తన మూడు విధానములలో ఖురాన్ జ్ఞానమును చివరిగా తెరచాటునుండి చెప్పడము వలన **"అంతిమ దైవ గ్రంథము"** అను పేరు ఖురాన్‌కు వచ్చినదనీ, ఈ విషయము సక్రమముగా ముస్లీమ్ సమాజమునకు కూడా తెలియదని చెప్పవచ్చును. ఎవరయినా హిందువులు గానీ, క్రైస్తవులుగానీ 'అంతిమ దైవగ్రంథమని' ఖురాన్‌నే ఎందుకంటారని ప్రశ్నిస్తే, మేము చెప్పిన జవాబు సరిపోవును. నేను చెప్పినట్లు కాకుండా ఏమి చెప్పినా, ఎట్లు చెప్పినా అది శాస్త్రబద్ధమైన జవాబు కాదు. తిరిగి ప్రశ్న రాగలదు. అందువలన 'ద్వితీయ దైవగ్రంథము' లో **"నీకు నీ విరోధి అడిగిన ప్రశ్నకు ఎదురాడని జ్ఞానమును అందిస్తాను"** అని చెప్పినట్లు దేవుడు ఖురాన్‌ను అంతిమ దైవగ్రంథమని చెప్పుటకు ఎదురాడని జ్ఞానమును అందించాడని నమ్ముచున్నాము.

దేవుడు మనుషులకు మూడు విధముల తన జ్ఞానమును తెలియజేతును అని చెప్పిన విధానములలో ప్రథమముగా వాణి ద్వారా చెప్పిన జ్ఞానము భగవద్గీతయను గ్రంథమయినది. ప్రథమముగా చెప్పిన విధానములోని జ్ఞానమగుట వలన, భగవద్గీతను ప్రథమ దైవగ్రంథముగా

చెప్పుచున్నాము. భగవద్గీత జ్ఞానమును మొదట ఆకాశవాణి చెప్పినది, దానిని సూర్యుడు భూమిమీద మనుషులకు, అప్పుడు మనుషులు మాట్లాడే భాషలో చెప్పాడు. ఇది కృతయుగములో జరిగిన సమాచారము. కృత యుగములో వాణి ద్వారా వచ్చిన జ్ఞానమును మూడు యుగములు గడచిన తర్వాత ద్వాపర యుగము చివరిలో కృష్ణుడు భారతదేశములో హిందీ భాషలో అర్జునునికి చెప్పాడు. అదే జ్ఞానమునే వ్యాసుడు సంస్కృతములో వ్రాసి గ్రంథమును చేశాడు. ఆ గ్రంథమునే ప్రథమ దైవగ్రంథముగా చెప్పుచున్నాము. ప్రథమ దైవగ్రంథము వ్రాయబడినది సంస్కృతములో కృష్ణుడు చెప్పినది హిందీ భాషలో, మొదట ఆకాశము చెప్పినది ఏ భాషలో అను ప్రశ్నను ముందే ప్రశ్నించుకొన్నాము. ఇప్పుడు ఆ ప్రశ్నకు పూర్తి జవాబును తెలుసుకొందాము. ఇంతవరకు ఆకాశ వాణి చెప్పింది అంటే అందరమూ తలూపి వింటున్నాము. అయితే ఆకాశము ఏ భాషలో చెప్పిన దను ప్రశ్న ఎవరికీ రాలేదు. ఇప్పుడు వచ్చింది కావున ఇప్పుడే జవాబును చూస్తాము.

దేవుడు నేరుగా ఎవరితోను మాట్లాడడు, అందువలన ఆయన మనుషులకు జ్ఞానమును తెలియజేయుటకు మూడు విధానములను ఎంచు కొన్నాడు. మూడు విధానముల ద్వారా తన జ్ఞానమును మనుషులకు తెలియజేశాడు. అయితే ఆకాశము ఒక్కమారే చెప్పుతుందనిగానీ, తన ప్రతినిధి ఒకమారే చెప్పుననిగానీ, తెరచాటునుండి ఒకమారే చెప్పబడును అనిగానీ చెప్పలేదు. ప్రజలలో అజ్ఞానము ఎప్పుడున్నా ఈ మూడు విధానముల ద్వారా అప్పుడప్పుడు జ్ఞానమును తెలియజేయుచుండును. తెరచాటు నుండి జ్ఞానమును తెలియజేసిన విధానము ఒకటే అయినా, ఆ విధానము ప్రకారము ఇప్పటికీ, మనకు తెలిసి రెండుమార్లు జ్ఞానమును

చెప్పడమైనది. అలాగే తన ప్రతినిధి ద్వారా జ్ఞానమును తెలియజేస్తానని చెప్పిన ప్రకారము, ఇప్పటికి రెండుమార్లు తెలియజేసినట్లు ఆధారము గలదు. ఇకపోతే ఆకాశము వాణి ద్వారా తెలియ చేస్తానను విధానము ప్రకారము ఒకటి, రెండు, మూడుమార్లు కాకుండా అనేకమార్లు తెలియ జేసినట్లు కలదు. ఈ నా మాట వినిన కొందరు ఆకాశము ఎప్పుడు తెలియజేసింది? ఏ భాషలో తెలియజేసింది? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు.

దేవుడు తయారు చేసిన సృష్ఠిలో మొదటిది ప్రకృతి. సత్యము చెప్పాలంటే దేవుడు సృష్ఠించినది ప్రకృతి కాదు. దేవుని నుండి విడువడి బయటకు వచ్చి కనిపించునది ప్రకృతి. ప్రకృతి దైవమునుండి వచ్చిన తర్వాత దైవము కూడా మూడు భాగములుగా తయారైనాడు. ఇదంతా గమనిస్తే దేవుడు మొత్తము నాలుగు భాగములుగా యున్నాడని తెలియు చున్నది. దేవుడు దేవునిగానే యుంటూ ప్రకృతిగా, పరమాత్మగా, ఆత్మగా, జీవాత్మగా యున్నాడు. నాలుగు భాగములుగా యున్నా నాలుగు ఆయన గానే యున్నాడనీ, ఆయనేనని చెప్పవచ్చును. అయితే ప్రకృతిని చూడ వచ్చునుగానీ, పరమాత్మను చూడలేము. అనగా దేవున్ని ఎవరూ చూడలేరు. దేవునికి రూప, నామ, క్రియలు లేవు. అందువలన దేవుడు కనిపించు వాడు కాడు, మాట్లాడువాడు కాడు, పని చేయువాడు కాడు. దేవుడు ఏది తలచినా తన ప్రకృతియే అన్నీ చేసిపెట్టును. ప్రకృతి-పరమాత్మగా యున్న రెండిటిని మాయ-దేవుడు అని చెప్పవచ్చును. దేవుడు, ఆత్మ, జీవాత్మగా యున్నట్లు, ప్రకృతి మాయగా కూడా యున్నది. ప్రకృతి-పరమాత్మ లేక మాయ-దేవుడు ఇద్దరు వేరుగాయున్నా ఇద్దరూ కలిసి ఒకటేనని చెప్పవచ్చును. సృష్ఠికొరకు పరమాత్మ ప్రకృతిని తననుండి విడదీసి

కనిపించునట్లు ఉంచాడు. దేవునినుండి బయటికి వచ్చిన ప్రకృతి, శరీరము బయట ఐదు భాగములుగా, శరీరములోపల మూడు భాగములుగా యున్నది. శరీరములోపల మాయ మూడు గుణముల రూపములో ఉండగా, శరీరము బయట ప్రకృతి ఐదు భాగములుగా యున్నది. ప్రకృతి యొక్క ఐదు భాగములు వరుసగా ఇలా కలవు. 1) ఆకాశము, 2) గాలి, 3) అగ్ని, 4) నీరు, 5) భూమి. ఈ ఐదు భాగములయిన ప్రకృతిలో ఒక్కొక్క భాగము ఒక్కొక్క శక్తి కల్గియున్నది.

ప్రకృతి అనగా 'ముఖ్యముగా చేయబడినది' అని అర్థము కలదు. కృతి అనగా చేయబడినదని అర్థము గలదు. 'ప్ర' అనగా ముఖ్యమైనదని అర్థము. దేవుని చేత ముఖ్యముగా చేయబడిన దానిని ప్రకృతియని చెప్పుచున్నాము. ప్రకృతిని చేసిన దేవుడు కనిపించడుగానీ, దేవుని చేత చేయబడిన ప్రకృతి కనిపించుచున్నది. దేవుడు అగోచరుడు, ప్రకృతి గోచరమైనది. ప్రకృతిలోని భాగములయిన భూమి కనిపించుచున్నది. అలాగే నీరు, అగ్ని, కనిపించుచున్నవి. రెండవదయిన గాలి కనిపించదని అందరూ అనవచ్చును. అయితే ఎండమావులలోనూ, తీవ్రమైన ఎండ యున్నప్పుడు గాలి కూడా కనిపించుచున్నది. ఇకపోతే ఆకాశము కనిపించదనీ, గగనము శూణ్యమని అంటుంటాము. గగనము శూణ్యము కాదని చెప్పలేముగానీ, ఆకాశము కూడా కనిపించుచున్నదనియే చెప్పు చున్నాము. ప్రకృతి కనిపించునది అన్నప్పుడు ఆకాశము కూడా కనిపించు ననియే చెప్పాలి. మనుషులందరూ ఆకాశము కనిపించదు అనినా, మేము మాత్రము ఆకాశము కనిపించునని చెప్పుచున్నాము. ఎట్లు కనిపించునను ప్రశ్నకు ఈ విధముగా జవాబు కలదు చూడండి.

ఆకాశము మేఘరూపమై కనిపించుచున్నది. మేఘములు ఆకాశములోని భాగములే. రూపములేని ఆకాశము తన రూపమును మేఘముల రూపములో చిత్ర విచిత్రములుగా చూపుచుండును. “ప్రకృతి పని చేయును” అని దేవుడు చెప్పినప్పుడు ప్రకృతిలోని భాగమైన ఆకాశము కూడా పని చేయునదై యుండవలెను. ఆకాశము శూణ్యమైనప్పుడు పని చేయుటకు వీలుకాదు, కావున ఆకాశము మేఘరూపమై పని చేయునట్లు ఆకాశమును దేవుడు నిర్మించాడు. ఆకాశము ఒక భూతమైయుండి మిగతా నాలుగు ప్రకృతి భూతములకంటే పెద్దదైయున్నది. మిగతా గాలి, అగ్ని, నీరు, భూమి అను నాలుగు భూతములు చేయు పనులకంటే ఎక్కువ పనిని ఆకాశము చేయుచున్నది. ఆకాశము ఎక్కువ పనిని చేయుటకు తన రూపమును మేఘములుగా మార్చుకొని, మేఘాల రూపములో మిగతా భూతములకంటే ఎక్కువ పనిని చేయుచున్నది. ఇప్పుడు ఆకాశము పని చేయునని తెలిసిపోయినది. ఆకాశము అనేకమైన పనులు చేయునట్లు ఇంతకుముందు ఒకమారు చెప్పాము. మేఘములు ఎవరికీ తెలియని అధ్భుతమైన పనులు చేయుచున్నవని చాలా గ్రంథములలో వ్రాయడము జరిగినది. మేఘములు పని చేయుచున్నవంటే ఆకాశము పనిచేసినట్లే నని తెలియవలెను.

ఆకాశము మేఘరూపములో మనుషులకు తెలియని ఎన్నో పనులను చేయునను మాట పెద్ద రహస్యమే అయినా, ఆ రహస్యమును మీకు చాలా సులభముగా వివరించి వ్రాయడము, విశదముగా చెప్పడము జరిగినది. మేఘము వలన వర్షము వస్తున్నది. వర్షము వచ్చినప్పుడంతా మేఘము గద్దించదు. కొన్ని సమయములలో మాత్రమే అనగా ఎండల కాలము తర్వాత వచ్చు ముందు వానలు కురియు సమయములో

మేఘములు ఉరుముల రూపములో పెద్ద పెద్ద శబ్ధములను చేయుచుండును. మేఘములు ఉరిమేటప్పుడు అప్పుడప్పుడు మెరుపులు కూడా వచ్చును. మెరుపులతో పాటు ఆకాశమునుండి పిడుగులు కూడా పడుచుండును. వర్షము కురియుట, ఉరుములు ఉరుముట, మెరుపులు మెరియుట, పిడుగులు పడుట ఇవన్నీ పనులు ఆకాశము వలననే జరుగుచున్నవని చెప్పవచ్చును. వర్షము కురియుట వలన సమస్త ప్రాణులకు అవసరమైన నీరు దొరుకుచున్నది. దీనినిబట్టి సమస్త ప్రాణులకు జీవనాధారమైన వర్షమును నీరును ఆకాశము మేఘరూపములో అందించుచున్నదని తెలియుచున్నది. ఇదియంతయూ మేఘముల వలన జరుగుచున్నదని అందరికీ తెలుసుగానీ, ఇదంతయూ ఆకాశము పనియేనని ఎవరికీ తెలియదు. ఆకాశము, మేఘములు వేరువేరు అనుకొంటున్నారు తప్ప, మేఘములు కూడా ఆకాశములోని భాగమేనని కొందరికి కూడా తెలియదు.

ఆకాశము మేఘముల రూపములో ఎన్నో పనులను చేయుచున్నది. మేఘములు చేయు కొన్ని పనులే మనుషులకు తెలియును. చాలా పనులు మనుషులకు తెలియవు. భూమిమీద ఒక క్రొత్త రోగము రావాలంటే, ఎక్కడా లేని ఆ రోగమును మేఘమే ఆకాశమునుండి తెచ్చి వదలును. క్రొత్త రోగము వచ్చినదంటే అది ఆకాశములోని భాగమైన మేఘము యొక్క పనియేనని మనుషులకు ఏమాత్రము తెలియదు. మేఘము ఆకాశముయొక్క మారురూపమని కూడా చాలామందికి తెలియదు. ఆకాశము ఎప్పుడు మేఘముగా మారుచున్నదను విషయము భూమిమీద ఎవరికీ తెలియదు. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో **"సృష్ట్యాదిలో జ్ఞానమును నేను సూర్యునికి చెప్పియుంటిని"** అని జ్ఞానయోగము మొదటి శ్లోకములోనే దేవుడు చెప్పియున్నాడు. అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో

'వహీ' ద్వారా చెప్పడము, దేవుడు తెలియజేయు మూడు విధానములలో ఒకటై యున్నది. వహీ ద్వారా (ఆకాశవాణి ద్వారా) తెలియజేయునని చెప్పిన విషయము సృష్ట్యాదిలోనే నెరవేరినదని మనకు తెలిసినది.

ఆకాశము ప్రపంచ సంబంధ అనేక కార్యములను మేఘముల రూపములో చేయుచున్నదని తెలిసిపోయినది. అంతేకాక ఆకాశము దైవజ్ఞానమును ప్రజలకు తన వాణి రూపములో తెలియజేసినదని భగవద్గీతలోనూ, ఖురాన్ గ్రంథములోనూ విన్నాము గానీ ఆ పని ఎలా జరుగుచున్నదో ఎవరికీ తెలియదు. తెలియాలను ఆలోచన కూడా ఎవరికీ రాలేదు. ఇప్పుడు మనము అడుగకున్నా దేవుడే ఆ విషయమును ప్రస్థావనకు తెచ్చి చెప్పినట్లున్నది. ఆకాశము మేఘముల రూపములో తయారై సృష్ట్యాదిలోనే ఉరిమి శబ్దము చేసినది. ఈ కాలములో మేఘముల ఉరుములు ఎలా వస్తున్నవో అలాగే పూర్వము కూడా వచ్చాయి. ఒక్క ఉరుములే కాక మెరుపులు, పిడుగులు మూడూ వచ్చాయి. మెరుపులు, ఇప్పటి కాలములో ఎలా ఉన్నాయో అప్పుడు కూడా అలానే వచ్చాయి. అదే విధముగా ఇప్పటి కాలములో పిడుగులు ఎలా వచ్చాయో అలాగే అప్పుడు కూడా వచ్చాయి. అయితే ఉరుములు మాత్రము ఇప్పటికంటే అప్పుడు కొంత తేడాతో వచ్చాయి. ఇప్పటివలె అప్పుడు కూడా శబ్దముతో కూడుకొన్న ఉరుములే వచ్చాయిగానీ శబ్దములలో కొంత తేడాయున్నదని చెప్పవచ్చును. ఇప్పటి కాలములో కూడా ఉరుములు, మెరుపులు, పిడుగులు మూడు వచ్చుచున్నా మెరుపులలో, పిడుగులలో తేడా కనిపించదు. అయితే ఉరుములలో మాత్రము ప్రతి సంవత్సరము కొంత తేడా కనిపించుచుండును. తేడాలేని ఉరుములు ఉండవు.

ప్రతి ఉరుము ఆకాశము యొక్క శబ్దమే, అనగా ఆకాశ వాణియే. దానినే ఇంకొక భాషలో 'వహీ' అన్నారు. వహీ అనగా 'వచ్చిన సమాచారము' అని అర్థము. వాణి అనగా సమాచారముతో కూడుకొన్న శబ్దము అని అర్థము. ఉరుము అనగా 'బిగ్గరగా చెప్పడము' అని అర్థము గలదు. ఆకాశము ఉరుముట ప్రతి సంవత్సరము మనము వింటూనే యున్నాము. ఆకాశము నుండి వచ్చు చిన్న పెద్ద ప్రతి శబ్దము జ్ఞానముతో కూడుకొని యున్నదని అది నాకు తప్ప మీకు తెలియదని, సూర్యుడు ఆయన వినిన సమాచారమును భూమివరకు మోసుకునివచ్చి మనుషులకు చెప్పడమైనది. సూర్యుడు విన్నది కూడా ఆకాశము యొక్క ఉరుములనే!

ఆకాశము ఆనాటినుండి నేటి వరకు ప్రతి సంవత్సరము ఒకమారయినా ఉరుముచున్నది. ఆ ఉరుములను ఎవరూ పట్టించుకోలేదు. ఉరుముల శబ్దము ఎలా వచ్చుచున్నదో కొందరు చెప్పుచున్నారుగానీ, శబ్దములోయున్న అర్థమును ఎవరూ చెప్పడము లేదు. మెరుపులకు, పిడుగులకు ఇలా వచ్చుచున్నవని వివరణ చెప్పుచున్నారు గానీ, వాటిలో దాగియున్న అర్థమును చెప్పలేకపోవుచున్నారు. సృష్ట్యాదిలో కూడా ఆకాశమునుండి మూడు రకముల స్పందనలే వచ్చాయి. **1) ఉరుము, 2) మెరుపు, 3) పిడుగులు.** ఇప్పటికాలములో కూడా ఆకాశమునుండి మూడు స్పందనలే వచ్చుచున్నవి. ఆకాశము నేరుగా మూడు స్పందనలను పంపడము లేదు. ఆకాశము మేఘముల ద్వారా తన స్పందనను ఉరుములు, మెరుపులు, పిడుగుల ద్వారా తెలియజేయుచున్నది. ఉరుములు, మెరుపులు, పిడుగులు వచ్చినప్పుడల్లా వర్షము వస్తుందను నమ్మకము లేదు. ఉరుములు, మెరుపులు వచ్చినప్పుడు కొన్నిమార్లు వర్షము రావచ్చును, రాకుండా పోవచ్చును. ఇప్పుడు ప్రతి సంవత్సరము మేఘములు ఏమి

చేయుచున్నవో, మొదట సృష్ట్యాదిలో కూడా ఇదే పని జరిగినది. ఈ పనులలోని ఆంతర్యమును సూర్యుడు గ్రహించగలిగాడు. అంతేగానీ ఆకాశము ప్రత్యేకమయిన భాషలో, ప్రత్యేకమయిన జ్ఞానము అని పేరుపెట్టి చెప్పలేదు. ఆకాశమునుండి వచ్చిన శబ్దమును గ్రహించిన సూర్యుడు తర్వాత ప్రజలకు తెలిసిన భాషలో చెప్పినది 'జ్ఞానమని' పేరుపెట్టి చెప్పాడు. అప్పుడు సూర్యుడు చెప్పినదే నేడు మూడు గ్రంథముల రూపముగా తయారై మన ముందరున్నది.

**ప్రశ్న :- మీరు మూడు గ్రంథముల ప్రస్తావన తెస్తున్నారు? మొదటనే ముస్లీమ్‌ల గ్రంథమయిన ఖురాన్‌లోని 42-51వ వాక్యమును చూపిస్తూ అందులో దేవుడు ఇలా చెప్పాడు అని ఒక ఆయత్‌ను చెప్పారు. మీరు హిందువుల జ్ఞానమును బోధిస్తున్నారా? లేక ముస్లీమ్‌ల జ్ఞానమును బోధిస్తున్నారా? మీరు హిందూ సమాజములోని వ్యక్తి కదా! అటువంటప్పుడు హిందువుల జ్ఞానము చెప్పక ఇతర మతముల జ్ఞానమును ఎందుకు చెప్పుచున్నారు?**

**జవాబు :-** ప్రపంచమునకంతటికీ ఒకే దేవుడున్నాడు, ఒకే జ్ఞానమున్నది. సృష్ట్యాదిలో సృష్టిని తయారు చేసినవాడు, జ్ఞానము చెప్పినవాడు ఒకే దేవుడే. అప్పటికీ ఇప్పటికీ ఒకే దేవుడు ప్రపంచమునకు అధిపతియై యున్నాడు. సృష్ట్యాదిలో మతములు లేవు. మతములు ఈ మధ్య కాలములో కలియుగములో రెండువేల సంవత్సరముల నుండి వచ్చినవి. మతముల ప్రసక్తి వచ్చిన తర్వాత మనుషులలో అజ్ఞానము వేగముగా పెరిగిపోయినది. నాకు మతములతో సంబంధములేదు. దేవుని పథముతో సంబంధముగా యున్నవాడినని చెప్పుచున్నాను. ఖురాన్ వాక్యమయినా, భగవద్గీత

శ్లోకమయినా నాకు రెండూ సమానమే. ఎందుకనగా! దేవుడు సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమునే మొదట భగవద్గీతగా వ్రాయబడినది. అదే జ్ఞానమే తర్వాత మిగతా రెండు గ్రంథములుగా వ్రాయబడినది. అవసరమును బట్టి మీకు జ్ఞానమును తెలియజేయు నిమిత్తము దేవుని జ్ఞానమును మూడు గ్రంథముల నుండి తీసి చెప్పుచున్నాను తప్ప నాకు ఇది నా మతము, అది పరాయి మతము అను ధ్యాసలేదు. మతములని నీవు పేరు పెట్టుకొనినా, నా భావములో అవి అన్నియూ దేవున్ని చేరు మార్గములుగా అనగా పథములుగా ఉన్నవని నేను అనుకుంటున్నాను.

**ప్రశ్న :- మీరు హిందూ మతస్థులా కాదా! చెప్పండి?**

**జవాబు :-** మీ లెక్కలో నేను హిందూ మతస్థుడనే! మతములు నిన్న మొన్న వచ్చినవి. అంతకుముందు హిందువులున్నారు. అయితే అప్పుడు హిందువులను హిందూ మతస్థులని ఎవరూ అనెడివారు కాదు. ఎందుకనగా! ఆ దినములలో మతమేలేదు. కావున ఫలానా మతస్థులను ప్రస్థావన రాలేదు. ఈ దినమున మనుషుల భావము ప్రకారమైతే నేను హిందూ మతస్థుడను. పూర్వమున్న జ్ఞానము ప్రకారమైతే నేను హిందూ పథస్థుడను. నేను చెప్పు జ్ఞానములో మతముల భావముండదు. పథముల భావమే ఉండును. అందువలన నేను చెప్పు బోధ మతాలకు అతీతమైనది. అందువలన నన్ను మతములతో ముడిపెట్టవద్దని ముందే చెప్పుచున్నాను. నేను చెప్పే జ్ఞానమును వింటే మతముల భావము మీలో కూడా లేకుండా పోవును. దేవునికి మతము అనునది సరిపోదు. అందువలన దైవజ్ఞానములో మతమును అడ్డు పెట్టవద్దండి.

మతము అంటే నీ ఇష్టముతో కూడుకొన్నది. నీ ఇష్టము దేవుని జ్ఞానము వద్ద యుండకూడదు. దేవుని జ్ఞానమువద్ద దేవుని ఇష్టముండాలి

గానీ మన ఇష్టముండకూడదు. దైవమార్గము అనగా పథము ఉండవచ్చును గానీ మతము అను మన ఇష్టము ఉండకూడదు. పథము అనగా మార్గము అని అర్థము దేవుని మార్గము ప్రకారము మనము నడువాలి. మతము అనగా మన ఇష్టము. దేవుని విషయములో మన ఇష్టము వచ్చినట్లు నడువక దేవుని మార్గము ప్రకారము నడువాలి. అందువలన మనిషి 'ఇష్టము' అను పదమును అనగా 'మతము' అను పదమును దేవుని విషయములో వాడవద్దని తెలుపుచున్నాము. మతము అను పదము పూర్తిగా హిందీపదము. దేశ భాషగా భారతదేశములో కృత, త్రేతాయుగములలో తెలుగు భాషయుండెడిది. నేడు తెలుగు భాష ఒక రాష్ట్రానికి పరిమితమై పోయినది. తెలుగు పదములు మిగతా భాషలలో కలిసిపోయి అవి ఆ భాషా పదములుగానే చెప్పబడుచున్నవి. మతము అనునది ద్వాపరయుగము కంటే ముందు తెలుగు పదముగానే యుండేది. అయితే కాలక్రమమున మతము అను పదము పూర్తి హిందీ పదముగా మారిపోయినది. ఓటు వేయడమును హిందీ భాషలో మతదాన్ అని అంటున్నారు.

మనిషి ఇష్టముతో కూడుకొనియున్నది మతము. దేవుని ఇష్టముతో కూడుకొన్నది దైవమార్గము, దానినే ఫథము అని అంటున్నాము. ఓటు నీకు ఇష్టము వచ్చిన వానికి వేయుచున్నావు. కావున ఓటు వేయడమును 'మతదాన్' అని అన్నారు. దేవుని జ్ఞానము యొక్క విషయములో మనిషి ఇష్టము పనికి రాదు. అందువలన దైవ ఇష్టము ప్రకారము నడువవలెనని, దేవుని గ్రంథములలో దేవుడు ఏమి చెప్పాడో దాని ప్రకారము నడుచుటకు దైవ గ్రంథములను మనిషి అనుసరించుచున్నాడు. అందువలన దేవుని విషయములో **'పథమే ముఖ్యము'** అని చెప్పుచున్నాము. మతము బయట ప్రపంచ విషయములలో పనికి వచ్చును. దేవుని జ్ఞానములో మతము

అను పదమును ఉపయోగిస్తే దేవుడు "నీ ఇష్టమా! నా ఇష్టమా!" అని అనగలడు. ఆధ్యాత్మిక జ్ఞానములో పథము. ప్రపంచ జ్ఞానములో మతము అవసరము. అయితే మనిషి దేవుని విషయములో మతమును అనుసరించుట వలన మనిషికి దైవజ్ఞానము తెలియకుండా పోయినది. నేను దైవ విషయములో దేవుని ఇష్టమును అనుసరించి నడుచుట వలన నాకు ఎవరికీ తెలియని జ్ఞానము తెలిసినది. అందువలన సృష్ట్యాదిలో ఆకాశవాణి ఏమి చెప్పినదో, ఎలా చెప్పినదో తెలియగలిగాను. నాకు తెలుసు కనుక ధైర్యముగా మీకు చెప్పగలుగుచున్నాను. ప్రపంచ విషయములలో అనగా నా కుటుంబములో నా ఇష్టము ప్రకారము నడువవలెనని చెప్పుచుందును. నా కుటుంబములో అంతా నా ఇష్టమే, అందువలన ప్రపంచ విషయములో మతము ఉండవలెనని, దేవుని విషయములో మతము ఉండకూడదని చెప్పుచున్నాను. నీకు ఈ వివరము తెలియక అన్నిచోట్ల దైవమార్గములో కూడా మతమునే చెప్పుచున్నావు. నేను అలా చెప్పడము లేదు.

'మతము' అను పదము హిందీ భాషలో మిగిలిపోయినది. వాస్తవముగా ఓటు అను పదము హిందీ భాషలోనిది. అయితే ఓటు అనునది తెలుగు భాషలో తెలుగు పదముగా చెప్పుచున్నాము. మతదాన్ అను మాటను చెప్పుచూ 'మతము' అను పదమును హిందీ పదముగా అనుకొంటున్నాము. అక్కడ 'మతదాన్' అని అన్నప్పుడు తన ఇష్టమును దానము చేయుట అని అర్థము వచ్చుచున్నది. దేవుని విషయములో దేవుడు చెప్పినట్లు అనగా దేవుని జ్ఞానమున్నట్లు నడువవలెను. అక్కడ మన ఇష్టము పనికిరాదు. మన ఇష్టమును ప్రక్క ఇంట్లో పోయి చెప్పినా వారు మన ఇష్టమును ఒప్పుకోరు. నీ ఇష్టమును నీ ప్రక్క ఇంటివారే ఒప్పుకోనప్పుడు ఎంతో పెద్ద దేవుడు ముందర ఎంతో చిన్నవాడయిన నీ

ఇష్టమును దేవుడు ఒప్పుకొనునా! మీరే చెప్పండి. అందువలన నీ ఇష్టమును నీ ఇంటిలో చూపుకో, దేవుని విషయములో చూపవద్దు. మతము అనునది దేవుని జ్ఞానమువద్ద ఉండకూడదు. మనిషి దేవునికి ఇష్టుడుగా ఉండవలెను.

**ప్రశ్న :- నీ మాట ప్రకారమైతే దేవుడు ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క గ్రంథమును ఎందుకు చెప్పాడు? దైవగ్రంథములు మూడూ మూడు పేర్లతో వేరువేరుగా ఉన్నాయి కదా! ఆ గ్రంథములను అనుసరించే మేము మూడు మతములున్నాయని చెప్పుచున్నాము. ఎవరి మతములో వారిని ఉండమని చెప్పుచున్నాము. దేవుడిచ్చిన గ్రంథములలో భగవద్గీత హిందువులకనీ, బైబిలు క్రైస్తవులకనీ, ఖురాన్ ముస్లీమ్‌లకనీ చెప్పుచున్నాము కదా! దేవుని గ్రంథములను బట్టియే కదా! మూడు మతముల పేర్లు చెప్పుచున్నాము. మీరు దేవుని జ్ఞాన విషయములో మతముల ప్రసక్తి ఉండకూడదని చెప్పి నప్పుడు ముస్లీమ్‌లు ఖురాన్ ఎందుకు చదవాలి? క్రైస్తవులు బైబిలును ఎందుకు చదవాలి? హిందువులు భగవద్గీతను ఎందుకు చదవాలి? మా మాటకు జవాబును చెప్పండి.**

**జవాబు :-** మతమునుబట్టి గ్రంథము వచ్చినదా? గ్రంథమునుబట్టి మతము పుట్టినదా! అని నేను అడుగుచున్నాను, మీరు చెప్పగలరా? భగవద్గీత జ్ఞానమును కృష్ణుడు ఐదువేల సంవత్సరముల పూర్వము అనగా 5150 పైన చెప్పియున్నాడు. ఆనాడు హిందూమతము అనునది లేదు. ఆ కాలములో మతము అను మాటే లేదు. భగవద్గీత చెప్పిన కొంతకాలమునకు ఒకటి లేక రెండు సంవత్సరములలో భగవద్గీత జ్ఞానమును చేతితో వ్రాసిన గ్రంథముగా వ్యాసుడు తయారు చేశాడు. అలా భగవద్గీతా గ్రంథము తయారయిన మూడు వేల సంవత్సరములకు అనగా! ఇప్పటికీ దాదాపుగా

రెండు వేల సంవత్సరముల పూర్వము ఏసుప్రభువు కొంత జ్ఞానమును చెప్పగా, దానిని ఆధారము చేసుకొని వందరెట్లు ఎక్కువగా బైబిలు అను గ్రంథమును తయారు చేశారు. నేడు బైబిలులో ఏసు చెప్పిన మాటలు నాలుగు సువార్తలుగా యుండగా పైగా 62 భాగములను అధ్యాయములుగా వ్రాశారు. సరే ఆ దినము ప్రత్యేకమయిన క్రైస్తవ మతముండేదా? అలాగే బైబిలు తయారయిన తర్వాత ఆరువందల సంవత్సరములకు జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి జ్ఞానము చెప్పగా, తర్వాత ఖురాన్ గ్రంథము కూడా తయారయినది. ఈ గ్రంథములను మూడింటిని దైవగ్రంథములని అంటున్నాము. ఈ మూడు గ్రంథములలో దేవుని ధర్మములు గలవు. మనిషి యొక్క మతిగానీ, అనుమతిగానీ, ఇష్టముగానీ ఈ గ్రంథములలో ఏమాత్రము లేవు. దేవుడు ఖురాన్‌ను ముస్లీమ్‌లకనీ, బైబిలు క్రైస్తవులకనీ, భగవద్గీత హిందువులకనీ పేరుపెట్టి చెప్పలేదు. హిందువులనిగానీ, క్రైస్తవులని గానీ, ముస్లీమ్‌లనిగానీ ప్రత్యేకించి చెప్పక మూడు గ్రంథములలోనూ సమస్త మానవులకు చెప్పు హితోపదేశమనీ, సమస్త జనులకు తెలుపు జ్ఞానమని చెప్పబడినది తప్ప ఇది ఫలానా మతము వారికని చెప్పలేదు. అటువంటప్పుడు మూడు దైవ గ్రంథములు మనుషులందరివగును. ఒక మతమునకు ఒక గ్రంథము పరిమితము కాదు. మూడు గ్రంథములు సమస్త జనులవియని దేవుడు మూడు గ్రంథములలో చెప్పియుండగా, ఇది మా గ్రంథము అది మీ గ్రంథము అని ఎందుకు అనుకోవాలి. మనుషులే మతములను సృష్టించుకొని మనుషులే వేరువేరు మతములుగా విడిపోయి గ్రంథములను కూడా పంచుకోవడము చేశారు. ఇదంతా మనుషులు చేసిన తప్పిదములే తప్ప దేవుడు ఎక్కడా తన జ్ఞానమునుగానీ, తానే సృష్టించిన మనుషులనుగానీ విభజించ లేదు. దేవుడు చెప్పిన జ్ఞానము

మనుషులందరికీ సమానముగా యుండగా, మనుషులే దేవుని జ్ఞానమును నాది నీది యని వేరుచేసి చెప్పుకోవడము వలన, ఇంతవరకు ఏ మతస్థునికీ దేవుని జ్ఞానము అర్థము కాకుండ పోయినదని చెప్పవచ్చును. భగవద్గీత జ్ఞానము హిందువులకు, బైబిలు జ్ఞానము క్రైస్తవులకు, ఖురాన్ జ్ఞానము ముస్లీమ్‌లకు సంపూర్ణముగా తెలియకుండా పోవడమేకాక, దేవుడు చెప్పిన జ్ఞానమును వేరు విధముగా అర్థము చేసుకోవడము జరిగినది. ముస్లీమ్ బైబిలును, భగవద్గీతను తన ఖురాన్‌వలె చూచినప్పుడు ఆ రెండు గ్రంథములను అల్లాహ్‌నే ఇచ్చాడని తెలిసి గౌరవించినప్పుడు, అల్లాహ్ చెప్పిన జ్ఞానము సంపూర్ణముగా అర్థము కాగలదు. అలాగే క్రైస్తవుడు ఖురాన్‌ను, భగవద్గీతను తన బైబిల్‌వలె భావించినప్పుడు, ఆ రెండు గ్రంథములను దేవుడే ఇచ్చాడని గౌరవించినప్పుడు దేవుడు చెప్పిన జ్ఞానము అర్థము కాగలదు. అదే విధముగా హిందువు బైబిలును, ఖురాన్‌ను తన భగవద్గీతవలె చూడగలిగినప్పుడు, ఆ రెండు గ్రంథములు దైవ గ్రంథములే యని తలచి గౌరవించినప్పుడు, పరమాత్మయైన దైవము చెప్పిన జ్ఞానము హిందువులకు సంపూర్ణముగా అర్థము కాగలదు.

అయితే నేడు ఒక మతము వారు మరియొక మతము వారిని ద్వేషముతో చూస్తూ దేవుడు చెప్పిన జ్ఞానమును కూడా అగౌరవపరుస్తున్నారు. ఎవరికి వారు వారివారి మతములే సరియైనవనీ, ఇతర మతములలో జ్ఞానమే లేదనీ, మత ద్వేషము కల్గియున్నారు. అందరికీ సృష్ఠికర్త ఒకడేయనీ, అందరికీ తండ్రివలెనున్న దేవుడు ఒకడేననీ తెలియక ఒకే దైవ జ్ఞానమున్న దైవ గ్రంథములను వేరువేరుగా చూస్తున్నారు. బైబిలు అంటే హిందువులకు ఏమాత్రము సరిపోదు. భగవద్గీత అంటే క్రైస్తవులకు కూడా ఏమాత్రము సరిపోదు. రెండు గ్రంథములలోయున్న జ్ఞానము ఒక్కటే అయినా, రెండు

గ్రంథముల జ్ఞానము చెప్పినవాడు ఒకడే అయినా ఆ విషయమును గ్రహించని మనుషులు ఒకరికొకరు వ్యతిరేఖతను వ్యక్తపరుచుకొను చున్నారు. అటువంటి వ్యతిరేఖతలను వదలి, పరమత ద్వేషము అను మాట లేకుండా ప్రతి మతస్థుడు మూడు దైవగ్రంథములను గౌరవించి చదివి అందులోని జ్ఞానమును తెలియగలిగితే, అప్పుడు సరియైన భావముతో దేవుడు అందించిన అర్థముతో గ్రంథములలోని జ్ఞానము తెలియగలదు.

**ప్రశ్న :- మూడు గ్రంథములను దైవగ్రంథములని విశ్వసించి, గ్రంథములను గౌరవిస్తూ చదివితే అందులోని జ్ఞానము తెలియగలదు అని మీరు చెప్పు చున్నారు కదా! మూడు గ్రంథములలో సంపూర్ణ జ్ఞానమున్నప్పుడు ఆకాశము ప్రతి సంవత్సరము జ్ఞానమును చెప్పుచున్నదని అన్నారు కదా! గ్రంథముల లోనే జ్ఞానమున్నప్పుడు ఆకాశము తన శబ్దము ద్వారా చెప్పవలసిన పనేమున్నది?**

**జవాబు :-** ఒక మతస్థుడు మూడు గ్రంథములను ఒకే దృష్ఠితో చూడలేదు. మూడు మతస్థులలో ఒక మతస్థుడు మిగతా రెండు గ్రంథములను అసూయతో చూడడము, వాటిని కనీసము చేతితో కూడా తాకకుండా పోవడము జరుగుచున్నది. ఒకే దేవుని జ్ఞానమును ఒక ప్రక్క తన గ్రంథముగా యున్న దానిని గౌరవిస్తూ, మరొక ప్రక్క మిగతా రెండు గ్రంథములుగాయున్న దానిని అగౌరవపరచుట వలన, తాను చదువుచున్న గ్రంథములోని జ్ఞానము కూడా సరిగా తెలియకుండా పోయినది. మొత్తము మీద ఐదు వేల సంవత్సరములనుండి ప్రథమ, మధ్యమ, అంతిమ దైవ గ్రంథములుగా జ్ఞానము గ్రంథములుగా బయటికి వచ్చినా, అది మనుషులకు తెలియకపోవడము వలన తన ధర్మము ప్రకారము ఆకాశము ప్రతి సంవత్సరము దైవజ్ఞానమును తెలియజేస్తూనే యున్నది.

**ప్రశ్న :- ఆకాశము దైవజ్ఞానమును ప్రతి సంవత్సరము తెలియజేసినా, ఆకాశము ఉరుముల రూపములో జ్ఞానము తెలియజేస్తున్నదని మనుషులకు తెలియదు కదా! ఆకాశము మేఘరూపములోయుండి ఉరుములుగా శబ్దము చేస్తే అది జ్ఞానమని మనుషులకు తెలియదు! అందువలన మేఘములు వేరే విధముగా మనుషులకు తెలియు భాషలో చెప్పవచ్చును కదా!**

**జవాబు :-** ఆకాశముకంటే ఎంతో పెద్ద దేవుడు స్వచ్ఛముగా మనుషులు మాట్లాడు భాషలోనే మనిషిగా వచ్చి చెప్పిపోయినా మనిషి జ్ఞానమును గ్రహించలేదు. మనుషులు చదువు భాషలోనే గ్రంథములు ఇచ్చినా వాటిలో యున్నది మన దేవుడు చెప్పిన జ్ఞానమే అనుకోక ఎవరో శత్రువులు చెప్పిన జ్ఞానముగా తలచి చదువలేదు. అంత మంచి అవకాశమున్నా తెలియని వారు, ఆకాశము మాట్లాడి తమ భాషలో చెప్పితే వినగలడని నమ్మకమేమి? మనుషులు మాట్లాడగలరు, కుక్కలు మొరగగలవు. అలాగే ఆకాశము శబ్దము చేయగలదు. కుక్క ఏమి చెప్పినా మొరిగినట్లేయుండును. అయితే ఆ మొరుగుడు అనేక రకములుగా ఉండును. అలాగే ఆకాశము ఏమి చెప్పినా శబ్దముగానే చెప్పును. అయితే ఆ శబ్దము అనేక విధములుగా యుండును. ఆకాశము శబ్దరూపములో జ్ఞానమును తెలియజేసినా, ఇది ఫలానా జ్ఞానమని మనిషి గ్రహించలేక పోవుచున్నాడు. అందువలన తన ధర్మము ప్రకారము దేవుని సేవ చేసినట్లు ఆకాశము ప్రతి సంవత్సరము తన శబ్దము ద్వారా జ్ఞానమును అనేక విధముల శబ్దములతో తెలియ జేస్తున్నది. ఆకాశము చేయు శబ్దము జ్ఞానమేనని మనుషులకు తెలియకుండా పోయినది. అయితే శ్రద్ధయున్నవానికి ఆకాశము తెలియ జేయు శబ్దరూపమైన జ్ఞానము ఫలానా అని తెలియును.

**ప్రశ్న :- ఆకాశము చేయు శబ్దమును జ్ఞానమని గ్రహించు మనుషు లున్నారా? ఉరుముల శబ్దములోని జ్ఞానము తెలియుటకు వానికి ముందు నుండి ఉరుములను గూర్చిన విషయమంతా తెలిసియుండవలెను కదా! అటువంటివారు ఉన్నారంటారా?**

**జవాబు :-** అటువంటి వారుండబట్టే కదా! ఆకాశమేఘములు జ్ఞానమును ఉరుముల రూపములో చెప్పుచున్నదని మేము ఇప్పుడు చెప్పుచున్నాము కదా! ఆకాశము జ్ఞానము చెప్పుచున్నదనడమేకాక, ఆకాశము అనేక విధముల దైవజ్ఞానమును తెలియజేస్తున్నదని చెప్పుచున్నాము.

**ప్రశ్న :- అయితే ఆకాశము మేఘరూపములో ఉరిమెడి ఉరుములకు, మెరిసే మెరుపులకు, పడే పిడుగులను గురించి కూడా మీకు తెలిసి యుంటుంది అని అనుకుంటున్నాను. మా అంచనా నిజమేనా?**

**జవాబు :-** నాకు పూర్తి వివరము తెలియదని చెప్పగలను. అయినా ఉరుములలో, మెరుపులలో, పిడుగులలో జ్ఞాన చిహ్నాములున్నవని చెప్పగలను. అయితే ఒకటిమాత్రము గట్టిగా చెప్పగలను. అదేమనగా! భగవద్గీతలో భగవంతుని రూపములో దేవుడు ఒకమాట చెప్పాడు. శ్రద్ధవుంటే జ్ఞానము లభిస్తుందని చెప్పుచూ శ్లోకములో **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్"** అన్నాడు. దేవుడు ఒకమాట అన్నాడంటే అది ఎప్పటికీ పొల్లుపోకుండా జరిగితీరును. జ్ఞానమును తెలియాలను శ్రద్ధను పెంచుకోగలిగితే ఉరుములలోని ఆంతర్యమైన జ్ఞానము కూడా నీ హృదయములో ఆత్మే తెలియజేయును. నా ఆత్మ నాకు తెలిపిన జ్ఞానమునుబట్టి నేను నేడు ఉరుములలో దైవజ్ఞానమున్నదని తెలుపుచున్నాను. ప్రతి సంవత్సరము ఆకాశము జ్ఞానమునే తెలుపుచున్నదని గట్టిగా చెప్పుచున్నాను.

**ప్రశ్న :- ప్రపంచములో ఎవరికీ తెలియని ఆకాశము యొక్క రహస్య బోధలు నీ కొక్కనికే తెలిసాయని మేము ఎలా నమ్మాలి? దానికి ఏమయినా ఆధారమున్నదా?**

**జవాబు :-** నేను నాకు తెలిసినది మీకు తెలిపాను. నేను చెప్పినదే నమ్మమని చెప్పలేదు కదా! శ్రద్ధయుంటే దేవుడు చెప్పినట్లు తెలుస్తుందని చెప్పుచున్నాను. శ్రద్ధ లేకుండానే ప్రయత్నము చేసి చూడకనే, ఆధారమేమి? అని అడిగితే నేను చెప్పినది నీకు ఆధారము కాదు. దేవుడు చెప్పిన మాటయే నీకు ఆధారమని చెప్పుచున్నాను. నేను ఆధారము అని చెప్పుటకు నేను రాలేదు. దేవుని మాటే అందరికీ ఆధారమని చెప్పుటకు వచ్చాను. శ్రద్ధను బట్టి నీకు జ్ఞానము లభించునను దేవుని మాటను ఆధారము చేసుకొని పథములో (దేవుని మార్గములో) ప్రయాణము సాగించుచున్నాను. అందువలన ఇంత వరకు చెప్పగలుగుచున్నాను. నీవు తినిన ఆహారము ఏమి రుచి వుందని అడిగితే అది ఎవరి అనుభవము వలన వారికి తెలియు విధానము. తిన్నవాడు చెప్పితే తినని వానికి అర్థము కాదు. స్వయముగా తిన్నప్పుడే ఎవనికయినా ఆహారములోని రుచి అనుభవ పూర్వకముగా తెలుస్తుంది.

**ప్రశ్న :- మాలోని అజ్ఞానము ప్రకారము అప్పుడప్పుడు పరిమితిని మించి ప్రశ్నలడుగుచున్నామేమో మాకు తెలియదు. ప్రశ్నలడగడములో ఏదయినా తప్పులుంటే క్షమించమని ముందే అడుగుచున్నాము.**

**జవాబు :-** అజ్ఞానమున్నప్పుడు ప్రశ్నలు ఎలా అయినా ఉండవచ్చును. పరిమితిని మించి చెప్పేవానికి తక్కువ చేసి అడిగినట్లు కూడా కనిపించు చుండును. అయితే జ్ఞానమును తెలుసుకోవాలను శ్రద్ధగలిగి ప్రశ్నను ఎట్లు అడిగినా ఫరవాలేదు. అడిగిన ప్రశ్న ఎట్లున్నా దానిలో జవాబు

తెలియాలను ఆసక్తినే మేము చూస్తాము. ఇంతవరకు జ్ఞానమును తెలియాలను శ్రద్ధతో ఎవరు ఏ ప్రశ్న అడిగినా దానికి నేను సంతోషముగా జవాబు చెప్పాను. అయితే వక్రబుద్ధితో ఏమాత్రము తెలియాలను శ్రద్ధ లేకుండా, నన్ను శోధించాలను భావముతో సౌమ్యముగా ప్రశ్నించినా అది నాకు ఏమాత్రము సరిపోదు. అడిగేవాడు పైకి సౌమ్యముగా అడిగినా నా లోపలి నుండి జవాబు రాదు. వచ్చినా అది అడిగిన వానిని ప్రక్కదారిని పట్టించునదిగా ఉండును. లోపలనుండి వచ్చు జవాబును బట్టి ఇతను అడిగిన ప్రశ్నలోని భావము బాగాలేదని నాకు కూడా తెలిసిపోగలదు. అందువలన అడిగే ప్రశ్న ఎలాగున్నా ఫరవాలేదు, మీరు జ్ఞానమును తెలియాలను శ్రద్ధగలిగి అడుగమని చెప్పుచున్నాము.

**ప్రశ్న :- ఆకాశములోని మేఘముల ద్వారా వచ్చు శబ్దములు స్వయముగా ఆకాశము చేయునవే అని అర్థమయినది. ఆకాశము చేయు శబ్దము వెనుక దేవుని భావమైన జ్ఞానమున్నదని అర్థమయినది. అయితే తమ అనుభవములోని మెరుపుల, పిడుగులలో ఏమి అర్థము ఇమిడియున్నదో మీరే తెలుపమని కోరుచున్నాము. ఇంతవరకు ప్రపంచములో ఎవరి దృష్టి మీరు చెప్పు ఉరుముల మీదగానీ, మెరుపుల మీదగానీ, పిడుగుల మీదకు గానీ పోలేదు. అయితే ఇప్పుడిప్పుడే మీ మాటలను బట్టి వాటి మీద ధ్యాస మాకు కల్గుచున్నది. దయచేసి మెరుపుల, పిడుగుల ఆంతర్యమును తెలుపమని అడుగుచున్నాము.**

**జవాబు :-** అలా అడిగిన మొదటివాడవు నీవే! అయితే ఈ విషయము ఐదు వేల సంవత్సరములప్పుడే భగవద్గీతయందుగల రాజవిద్యా రాజగుహ్యా యోగమను అధ్యాయమున 13వ శ్లోకమందు మేఘములు జ్ఞానము చెప్పును

అను విషయమునకు నాంది పలుకబడియున్నది. తర్వాత భగవద్గీతలోని విషయమునే బైబిలు సువార్తలలోనూ, ఖురాన్ ఆయత్‌లలోనూ చెప్పడమైనది. ఇప్పటికి మూడుమార్లు మూడు దైవగ్రంథములలో మేఘముల ఉరుముల ప్రస్తావన వచ్చినా అది మనకు ఏమాత్రము అర్థము కాకుండా పోయినది. మీకు అర్థముకాని విషయమునే నేను చెప్పుచున్నాను గానీ, నేను క్రొత్తగా చెప్పునదేమీ కాదు. నాకు ఈ విషయము పాతగానేయున్నా మీకు క్రొత్తదైనందున శ్రద్ధగా, విచక్షణగా బుద్ధితో వినవలెనని తెలుపుచున్నాము.

ఆకాశము సాధారణముగా కనిపించకపోయినా అవసరమైనప్పుడు మేఘములుగా మారి కనిపించుచున్నది. కనిపించుటకు మాత్రమే ఆకాశము మేఘములుగా మారడము లేదు. ఆకాశము అనేక కార్యములను చేయుటకు మేఘములుగా మారుచున్నది. ప్రకృతికి రూపమున్నది, ప్రకృతి పనిచేయు చున్నదను సూత్రమును అనుసరించి, ప్రకృతిలోని భాగమయిన ఆకాశము అవసరమైనప్పుడు మాత్రమే రూపమును ధరించుచున్నది, కార్యములను చేయుచున్నది. ఆకాశము మేఘ రూపములో చేయు కార్యములన్నీ మనుషులకు తెలియవు. అయితే మేఘములు ఉరమడము, మెరువడము చేయడమేకాక, ఆకాశమునుండి పిడుగులను వదలుచున్నది, అట్లే పై నుండి వర్షమును కురియడము పనులు అందరికి తెలిసినవే, అందరూ చూచునవే. వర్షము వచ్చిన ప్రతిమారు మేఘముల ఉరుములు, మెరుపులు, పిడుగులు ఉండవు. ఉరుములు లేకుండా వర్షము రాగలదు. అయితే మేఘములు రాకుండా వర్షము కురవదు. అందరికీ తెలియునట్లు మేఘముల స్పందన నాలుగు రకములగలదు. ఉరుముట, మెరియుట, పిడుగులు పడుట, వర్షము కురియుట ప్రతి సంవత్సరము జరుగుచునే యున్నవి.

'ఉరుముట' అనగా గట్టిగా చెప్పుటయని చెప్పవచ్చును. అజ్ఞానములో యున్న మనిషి మెత్తగా చెప్పేమాటలను వినడు, ఎంత మంచిగా చెప్పినా ఆ మాటలను లెక్కపెట్టడు. అందువలన అజ్ఞానికి గట్టిగా గద్దించి చెప్పవలసియుంటుంది. గద్దించి చెప్పితేనే ఎక్కడయినా చెడు మంచిగా మారగలదు. అదే విధానమును అనుసరిస్తూ మేఘములు గట్టిగా గద్దించి శబ్దము చేశాయి. ఆ శబ్దము మనుషులకు అర్థము కాలేదు. మేఘములు గట్టిగా ఉరిమి శబ్దరూపముగా చెప్పినది అంతయూ దైవజ్ఞానమే అనుటకు అంతిమ దైవగ్రంథములో స్వచ్ఛమయిన సాక్ష్యము కలదు. దైవ గ్రంథమయిన ఖురాన్‌యందు 21వ సూరా 32వ ఆయత్‌నందు ఇలా కలదు చూడండి. **(21-32) "మేము ఆకాశమును సురక్షితమైన కప్పుగా చేశాము. అయినా వారు అందులోని సూచనలనుండి (ఆయత్‌లనుండి) విముఖులగుచున్నారు"** ఈ ఆయత్‌లో ముందే ఆకాశమునుండి జ్ఞానము తెలియబడినా, మనుషులు దానిని గ్రహించుటలో ఆసక్తిగా లేరు విముఖులుగా యున్నారని చెప్పారు. ఈ మాటనుబట్టి మేఘములు జ్ఞానమును చెప్పుచున్నవని, మేఘములయినందున మేఘముల భాషయైన శబ్దరూపములో చెప్పుచున్నవని తెలిసినది. అదే విషయమునే మేము ఇప్పుడు చెప్పుచున్నాము, అంతేగానీ మేము ఏమీ కల్పితము చేసి చెప్పలేదు.

ఉరుముల తర్వాత మెరుపులు కూడా ఆకాశములో కనిపించు చుండును. ఉరుముల ద్వారా అనగా గట్టిగా చెప్పినా జ్ఞానము మనిషిలో చేరితే జ్ఞానము అగ్నిగా మారగలదు. అగ్ని వెలుగుతో కూడుకొని యున్నట్లు జ్ఞానాగ్ని కూడా వెలుగుతోనే యున్నది. అనగా మనిషికి తెలిసిన దైవజ్ఞానము, మేఘముల చేత చెప్పబడిన జ్ఞానము ప్రకాశవంతమైనదని తెలియునట్లు

ఉరుములు వచ్చినప్పుడు మెరుపులు కూడా వచ్చును. వినపడు జ్ఞానము అగ్నియైయున్నదని కర్మలను దహించు ప్రకాశమున్నదని తెలుపు నిమిత్తము ఉరుముల తర్వాత మెరుపులు వస్తున్నవి. ఉరుములు, మెరుపులే కాకుండా అక్కడక్కడా పిడుగులు పడడము కూడా జరుగుచుండును. బోధకుని నుండి జ్ఞానమును తెలిసినవాడు జ్ఞానము ప్రకారము నడువగలిగితే జ్ఞానము అగ్నివలె తయారగును. అగ్నివలె తయారయిన జ్ఞానశక్తి మనిషిలోని కర్మలను భస్మీపటలము చేయును. కర్మను అనగా పాపములను మరియు పుణ్యములను జ్ఞానాగ్ని లేకుండా చేయునను దానికి గుర్తుగా పిడుగులు ఆకాశమునుండి పడుచున్నవి. జ్ఞానాగ్ని అను జ్ఞానశక్తి మనిషిలోని కర్మలను కాల్చి వేయుచున్నదని, ఎటువంటి పాపమునయినా బూడిద చేయుచున్నదని తెలుపు నిమిత్తము ప్రత్యక్షముగా పిడుగులు పడుచున్నవి. జ్ఞానశక్తి యున్న చోట 'కర్మ దహనము' అని తెలియునట్లు పిడుగు పడినచోట ఏదున్నా బూడిద అగుచున్నది. మనుషులుగానీ, జంతువులుగానీ పిడుగు పడిన చోటయుంటే నల్లగా మాడిపోవుచున్నవి. పిడుగు తాకిడికి ఏదున్నా చనిపోవడము జరుగుచున్నది. పిడుగు నాశనమును సృష్టించుటను గమనిస్తే జ్ఞానాగ్ని కర్మను ఈ విధముగా కాల్చివేయునని, లేకుండా చేయునని తెలుపు నిమిత్తమే ప్రత్యక్షముగా అలా జరుగుచున్నదని తెలియుచున్నది.

ఆకాశమునుండి గట్టిగా ఉరుములు ఉరిమినందుకు, ప్రకాశముగా మెరుపులు మెరిసినందుకు, పిడుగులు పడినందుకు ఆధ్యాత్మిక రీత్యా పరోక్షముగా యున్న విషయమును ప్రత్యక్షముగా చూపినట్లయినది. అంతేకాక ఉరుములు, మెరుపులు, పిడుగులు పడిన తర్వాత దేవుడు అదే పనిగా మనిషి జ్ఞానమును తెలియుటకు ఇవి అవసరమని వరుస క్రమము తెలుపుటకు దేవుడు అలా చేశాడని ప్రత్యక్షముగా చూపాడని అర్థమగు

చున్నది. మనిషి కర్మను జ్ఞానమను అగ్ని కాల్చివేసి, బూడిద చేయగా, కర్మ క్షయము జరుగుచుండగా, మనిషిలోని కర్మంతయూ అయిపోయినప్పుడు మనిషి మోక్షము పొందును. అట్టివాడు తిరిగి జన్మించడు అగ్ని మెరుపుగా, పిడుగు కాల్చు శక్తిగా కనిపించినా, మనిసి మోక్షము పొందిన తర్వాత, కర్మంతయూ అయిపోయిన తర్వాత ఇక జ్ఞానమను అగ్నితో ఇక పని లేదు అన్నట్లు అగ్నికి వ్యతిరేఖమయిన నీరు వర్షముగా వచ్చుచున్నది. కర్మే లేనప్పుడు జ్ఞానాగ్నే అవసరము లేదు, వాడు మోక్షమును పొంది యున్నాడు. కనుక అగ్నికి సంబంధములేని నీరును వర్షముగా కురిపించాడని తెలియు చున్నది.

దేవుడు తన ఆకాశము ద్వారా జ్ఞానమునే తెలియజేయుచున్నాడని నేను ఈరోజు చెప్పుచున్నాను. కొందరు నా మాటను నమ్మవచ్చు, నమ్మకపోవచ్చును. నేను యోగీశ్వరులనని తెలిసినవాడు నా మాట సత్యమేయని తెలియగలడు. నేను ఫలానాయని తెలియనివారు నా మాటను నమ్మలేకపోవుచ్చును. అయితే మీరు నమ్ముటకు బలమును చేకూర్చుటకు అంతిమ దైవగ్రంథములో ముందే 1400 సంవత్సరముల క్రిందటే చెప్పిన కొన్ని మాటలను గమనించమని తెలుపుచున్నాను. అంతిమ దైవగ్రంథ మయిన ఖురాన్‌లో 13వ సూరాలో ఆయత్ 2, 12, 13 లలో ఏమున్నదో ఇప్పుడు చూస్తాము. **(13-2) "మీరు చూస్తున్నారు కదా! ఆకాశా లను స్థంబాలు లేకుండా నిలిపిన ఆయన అల్లాహియే. ఆ తర్వాత తన సింహాసనాన్ని అధిష్ఠించాడు. మరియు ఆయన సూర్యచంద్రాదులను తన నియమానికి బద్దులుగా చేశాడు. ప్రతి ఒక్కటి తన నిర్ణీత కాలములో పయణిస్తూ ఉంటుంది. ఆయన అన్ని వ్యవహారాలను నడిపిస్తూ తన సూచనలను వివరిస్తున్నాడు.**

**బహుశా ఈ విధముగానైనా మీరు దేవున్ని కలుసుకోవలసి ఉందను విషయాన్ని నమ్ముతారని"**

ఈ వాక్యము చివరిలో "తన సూచనలను వివరిస్తున్నాడు" అని కలదు. ఇంకొక గ్రంథములో ఇదే వాక్యములో చివర **"మీరు మీ ప్రభువును (దేవున్ని) కలుసుకొనే విషయాన్ని నమ్ముటకు ఆయన తన నిదర్శనాలను స్పష్టముగా వివరిస్తున్నాడు"** అని కలదు. ఒక గ్రంథములో **"తన సూచనలను వివరిస్తున్నాడు"** అని అన్నాడు. ఆకాశమును గురించి చెప్పవలసినదంతా చెప్పి చివరిలో తన సూచనలను అనడములో అర్థమును చూస్తే ఆ సూచనలు తనను కలుసుకొనే దానికయినందున ఆ సూచనలు జ్ఞాన వచనములని తెలియుచున్నది. అనగా దేవుడు తన జ్ఞానమును ఆకాశము నుండి తెలుపుచున్నాడని అక్కడ చెప్పడమైనది. ఇంకొక గ్రంథములో **"దేవున్ని కలుసుకొనే విషయాన్ని నమ్ముటకు తన నిదర్శనాలను స్పష్టముగా వివరిస్తున్నాడు"** అని కలదు. తన నిదర్శనాలు అంటే తన జ్ఞాన విషయములని అర్థము. తను కలుసుకొనే నిమిత్తము దేవుడు తన జ్ఞానమును ఆకాశము ద్వారా తెలియజేసినట్లు ఈ వాక్యముల ద్వారా తెలియుచున్నది. అదే 13వ సూరాలో 12వ ఆయత్‌లో ఇలా కలదు. **(13-12) "ఆయన మీకు భయము, ఆశ కల్గించేందుకు మెరుపులను చూపుచున్నాడు. ఆయనే బరువైన మేఘములను సృజిస్తున్నాడు." (13-13) "ఉరుము సహితము ఆయన పవిత్రతను కొనియాడు తోంది. ఆయనను ప్రశంసిస్తోంది. దూతలు కూడా ఆయనను స్తుతిస్తున్నారు. ఆయన పిడుగులను పంపి తాను కోరినవారిపై పడవేస్తున్నాడు. అవిశ్వాసులు అల్లాహ్**

**విషయములో పిడివాదానికి దిగుచున్నారు. ఆయన మహాశక్తి వంతుడు"** ఈ వాక్యములో ఉరుము సహితము ఆయన పవిత్రతను కొనియాడుతోంది అని ఉన్నది. దాని భావము ఉరుముల వలన వచ్చే శబ్దము జ్ఞానముతో నిండి యున్నదని అర్థము. ఆయన పవిత్రతను కొనియాడడము అంటే ఆయన జ్ఞానమును చెప్పడము అనియే అర్థము. అంతేకాక దేవుడు అనుకొన్న వారి కర్మను లేకుండా చేయునని చెప్పుటకు సూచనగా, ఆయన అనుకొన్న వారిమీద పిడుగులను పడవేయుచున్నాడని చెప్పాడు. సూరా 21, ఆయత్ 32లో ఆకాశము నుండి వచ్చు జ్ఞానమును మనుషులు తెలియకున్నారని ఇక్కడ చెప్పడమైనది **(21-32) "మేము ఆకాశమును సురక్షితమైన కప్పుగా చేశాము. అయినా వారు అందులోని సూచనలను (ఆయత్‌ల) నుండి విముఖులగు చున్నారు."** ఈ వాక్యము "తెలుగు భాషలోని దివ్యఖురాన్ సందేశం" అను గ్రంథమందు గలదు. ఆకాశమునుండి దైవసూచనలయిన జ్ఞానమును తెలియుటకు కొందరు విముఖముగా ఉన్నారని చెప్పాడు. ఇక్కడ స్పష్టముగా ఆకాశమునుండి జ్ఞానము తెలియబడుచున్నదని అర్థమగుచున్నది.

అదే ఖురాన్ గ్రంథములో 27వ సూరా, 75వ ఆయత్‌లో ఆకాశము నుండి బోధరూపములో వచ్చిన జ్ఞానమును మరియు భూమిమీద మనుషులు గ్రంథినుండి వచ్చిన జ్ఞానము రెండు దైవగ్రంథరూపములో వ్రాయబడి యున్నదని చెప్పారు చూడండి. **(27-75) "ఆకాశములో మరియు భూమిలో అగోచరముగా యున్నది ఏదీ కూడా స్పష్టమైన ఒక గ్రంథములో వ్రాయబడకుండా లేదు."** సూరా 13, సూరా 21, సూరా 27లలోని వాక్యములలో ఆకాశము యొక్క రహస్యమునంతటిని

చెప్పినట్లున్నది. నేను ఈ రోజు ఆకాశ మేఘముల వలన వచ్చే ఉరుములలో ఎంతో జ్ఞానమున్నదంటే నమ్మలేని వారు 1400 సంవత్సరముల పూర్వము చెప్పిన ఖురాన్ గ్రంథములో దేవుడు చెప్పిన వాక్యమును తప్పక నమ్మవలసియున్నది. దేవుడు తాను ఎవరిని మోక్షమునకు పంపవలెనో నిర్ణయించి ఆయనకిష్టమైన వారిని మోక్షమునకు పంపునని చెప్పునట్లు **'తాను కోరినవారిపై పిడుగులను పడవేయుచున్నాడు"** అని (13-13)లో చెప్పడమైనది. **"దేవుడు అనుకుంటే ఎవని కర్మ ఎంత యున్నా, ఎవని పాపము ఎంతయున్నా వాని కర్మనంతటినీ ఒక్కమారుగా క్షమించివేయును".** అదే విషయమునే బాహ్యముగా అంతరార్థముతో నింపి పిడుగులు పడునట్లు చేయుచున్నాడు. ప్రత్యక్ష జ్ఞానమును గురువు రూపములో (భగవంతుని రూపములో) బోధించు దేవుడు, తన జ్ఞానమును సృష్ట్యాదిలోనే వాణిగా (శబ్దరూపములో) తెలియజేశాడు. ఈ విషయమును చెప్పుచూ ఆకాశమునుండి వచ్చిన శబ్ద రూప జ్ఞానము, భూమిమీద మనుషుల నుండి వ్రాతరూపములో వచ్చిన జ్ఞానమును గురించి చెప్పుచూ జ్ఞానశక్తి కంటికి కనిపించునది కాదని అదే జ్ఞానశక్తిగల జ్ఞానమును అనగా అగోచరమైన జ్ఞానశక్తిని స్పష్టమైన దైవగ్రంథములో నింపి వ్రాయబడుచున్నదని తెలుపుచూ (27-75) వాక్యములో అగోచరముగా యున్నదేదీ కూడా గ్రంథములో వ్రాయబడకుండా యుండలేదు అని చెప్పాడు. ఇదంతయూ అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో చెప్పియున్నారు. దేవుడు తన జ్ఞానమును మూడు గ్రంథములలో చెప్పియున్నాడు గనుక మరియొక గ్రంథములో ఏమున్నదో చూస్తాము.

మొదట తయారయిన భగవద్గీత గ్రంథములోనే ఆకాశము యొక్క సారాంశమును చెప్పియున్నారు. దైవ సంబంధ ప్రకృతి అని రాజవిద్యా రాజగుహ్య యోగమున 13వ శ్లోకమున చెప్పియున్నారు.

13.శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః ।
భజంత నన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥

భావము :- **"దైవ ప్రకృతిని ఆశ్రయించిన వారు ఇతరమును వదలి నన్నే ఆరాధింతురు. దైవప్రకృతి వలన నేనే జీవరాసులకు అధిపతినై నాశనము లేనివాడనై యున్నానని తెలిసిన వారగుదురు."** దేవుడు సర్వ జీవరాశులకు అధిపతియనీ, నాశనములేని వాడని తెలిసి ఆయననే భజించుట ప్రకృతి తెలిపిన జ్ఞానము వలన జరుగుచున్నది. ప్రకృతి తన శబ్దము ద్వారా దేవుని జ్ఞానమును తెలియజేసినదనీ జ్ఞానయోగము మొదటి అధ్యాయములోనే కలదు. తర్వాత అదే విషయమునే రాజవిద్యా రాజగుహ్యా యోగమను అధ్యాయమున 13వ శ్లోకమందు కూడా తెలియబడినది. ఇకపోతే ఇదే విషయమే మధ్యమ దైవ గ్రంథమయిన బైబిలు యొక్క మూడు సువార్తలలో కూడా కలదు. దానినే ఇప్పుడు గమనిద్దాము. మత్తయి సువార్తలలో 16, 17 వాక్యములలో ఈ విధముగా కలదు చూడండి. ***(16) ఏసు బాప్తీస్మము పొందిన వెంటనే నీళ్లలోనుండి ఒడ్డుకు వచ్చెను. ఇదిగో ఆకాశము తెరువబడెను. దేవుని ఆత్మ పావురము వలె దిగి తనమీదికి వచ్చుట చూచెను. (17) మరియు ఇదిగో ఈయనే నా ప్రియ కుమారుడు ఈయనయందు నేను ఆనందించుచున్నానని ఒక పెద్ద శబ్దము ఆకాశము నుండి వచ్చెను.*** ఆకాశము నుండి పెద్ద శబ్దము వచ్చినదని చెప్పడమును చూస్తే ఆకాశము పెద్దగా ఉరిమినదని అర్థము. ఆకాశము ఎప్పుడుగానీ, మనుషుల భాషలో మాట్లాడలేదు, ఎప్పటికీ మాట్లాడదు. ఆకాశము తన భాషలోనే చెప్పును ఆకాశము భాష శబ్దము చేయడమే. ఆ శబ్దములోని అంతరార్థమును గ్రహించువారుండవచ్చును. ఏసు

బాప్తిస్మము పొందిన దినమున అప్పటి ఉద్దేశ్యమును తెలుపుచూ మేఘము ద్వారా ఆకాశము ఉరిమినది. దానినే ఈ వాక్యములలో చెప్పారు. ఇదే విషయమే మార్కు సువార్త ఒకటవ అధ్యాయము 10, 11 వచనములలో ఇలా గలదు.

**(10) ఆయన నీళ్లనుండి ఒడ్డుకు వచ్చుచుండగా ఆకాశము చీల్చబడెను. పరిశుద్ధాత్మ పావురమువలె తనమీదికి దిగివచ్చుటను చూచెను. (11) నీవు నా ప్రియ కుమారుడవు, నీయందు నేను ఆనందించుచున్నానని ఒక శబ్దము ఆకాశము నుండి వచ్చెను.** మత్తయి సువార్తలో చెప్పిన (16) వ వచనములో ఆకాశము తెరువబడెను అని కలదు. మార్కు (10) వ చనములో ఆకాశము చీల్చబడెను అని కొద్ది మార్పుతో చెప్పబడినది. అయితే రెండూ ఒకే అర్థమని గ్రహించవలెను. ఆకాశము తెరువబడెను లేక ఆకాశము చీల్చబడెను అను మాటలోని ఆంతర్యము ఆకాశము మెరిసిందని అర్థము. ఆకాశములో మేఘముల మధ్యలో ఆకాశము తెరువబడినట్లు తలుపు చాటున వెలుగు కనిపించినట్లు మెరుపులు కనిపించుచుండును. ఆ దినము ఆకాశములో మెరుపులు వచ్చి ఉరుములు కూడా పెద్ద శబ్దముగా వినిపించాయనీ, అందులోని భావమునే వాక్యములో చెప్పారనీ అర్థమగుచున్నది. ఆ రోజు మేఘము శబ్దము చేయగా, ఆ శబ్దములోని విషయమును గ్రహించి ఈ విషయమునే చెప్పిందని వ్రాశారంటే పూర్వము ఆకాశ ఉరుముల శబ్దముల అర్థమును గ్రహించే వారున్నారని తెలియుచున్నది. ఆ దినములలోనే కాకుండా ఈ దినములలో కూడా ఎవయినా అటువంటి స్థోమత యున్న వారుండవచ్చును.

దేవుడు తన జ్ఞానమును మూడు విధముల భూమిమీద మనుషులకు తెలియ చేస్తానని చెప్పినప్పుడే ఒకటి ఆకాశమునుండి శబ్దము

ద్వారా చెప్పబడునని చెప్పియున్నాడు. అయితే ఒకమారే చెప్పునని చెప్పలేదు. దేవుడు ఆకాశవాణి ద్వారా తెలియజేస్తానని చెప్పిన మాట ప్రకారము ప్రతి సంవత్సరము ఆకాశమునుండి ఉరుముల శబ్దముతో జ్ఞానమును ఒకే విధముగా చెప్పకుండా వేరువేరు జ్ఞానమును తెలియ జేస్తున్నాడు. అందువలన ప్రతి సంవత్సరము ఆకాశ శబ్దములు మారుచుండును.

ప్రకృతిలోని ఒక భాగమే ఆకాశము. "ప్రకృతి పని చేయును" అని చెప్పినట్లు, ప్రకృతిలోని ఆకాశము కూడా అనేక పనులను చేయుచున్నది. అనేక కార్యములలో దైవజ్ఞానమును తెలుపు కార్యము అతి ముఖ్యమైనది. అందువలన ప్రతి సంవత్సరము ఎంతో కొంత జ్ఞానమును భూమిమీద తెలుపడము జరుగుచున్నది. అనేక పనులను ఆకాశము నిశ్శబ్దముగా చేయుచున్నది. ఒక జ్ఞానము తెలుపు కార్యములోనే గద్దించి ఉరుము చున్నది. **ప్రతి ఉరములోను జ్ఞానము గలదు. ప్రతి మెరుపులోను జ్ఞానశక్తి కలదు. ప్రతి పిడుగులోనూ కర్మ దహనము కలదు.** ఈ విషయమును తెలిసినవాడు శ్రద్ధగలిగియంటే మేఘము యొక్క శబ్దములో అమరియున్న జ్ఞానము కొంతయిన తెలియగలదు.

ఆకాశము తన శబ్దము ద్వారా జ్ఞానమును తెలియజేయడము మొదట సృష్ట్యాదిలోనే ప్రారంభమయినది. అప్పటినుండి నేటి వరకు కొనసాగుచున్నది. ఇంకా జరుగబోవు కాలములో కూడా మేఘములు జ్ఞానమును చెప్పుచుండును. అయితే ఇక్కడ ఇంకా తెలియవలసిన విషయము ఒకటి గలదు. ఆకాశము కూడా ఒక భూతమైయున్నదని మరువకూడదు. భూతము అంటే ఏదో దయ్యమని అనుకోకూడదు. భూతము అనగా జీవాత్మయని అర్థము. జీవాత్మ ఎక్కడుంటుందో అక్కడే

ఆత్మ కూడా ఉండితీరాలి. ఆకాశము సాధారణ భూతము కాదు. ప్రపంచములో అన్నీ సాధారణ జీవరాసులే (సాధారణ భూతములే) కాగా ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ఈ ఐదు మహా భూతములుగా ఉన్నాయి. అందులో ఆకాశము మొదటిది. ఆకాశములో కూడా ఆత్మయున్నది. ఆకాశములోని ఆత్మయే అన్ని పనులు చేయుచున్నది. పైకి కనిపించునది ఆకాశమే అయినా ఆకాశము వెనుక అణిగియున్నది ఆత్మ. ఎవరికీ తెలియక అణిగియున్న ఆత్మయే శబ్దరూపములో జ్ఞానమును చెప్పుచున్నది. జీవుని ద్వారా చెప్పబడునదిగానీ, చేయబడునదిగానీ ఏదయినా ఆత్మే చేయుచున్నది. ఆత్మ ఎవరికీ తెలియక అణిగియుండుట వలన ఆత్మ విషయము ఎవరికీ తెలియదు. సృష్ట్యాదిలో దైవ జ్ఞానమును ఆకాశము ద్వారా మేఘముల వెనుకనుండి తెలిపినది ఆత్మయేనని తెలియ వలెను. అన్నిటిలో అణిగియున్న ఆత్మను తెలియుటకు ఎంతో జ్ఞానము అవసరము. దేవుడు మనకు ఇచ్చిన జ్ఞానము వలన సృష్ట్యాదిలో దేవుని సంకల్పముతో ఆత్మ తొలిపలుకుగా జ్ఞానమును చెప్పినది. ఆనాడు మేఘము ఉరిమిన శబ్దమే ప్రపంచమునకు తొలి జ్ఞానమయినది. ఆ దినము చెప్పిన జ్ఞానము సంపూర్ణమైన జ్ఞానమగుట వలన అదే జ్ఞానమే ప్రపంచ మునకంతటికీ ఆధారమైనది.

ఒక సందేశముతో కూడుకొన్న ఏ శబ్దమునయినా 'మాట' అంటాము. 'మాట' అనగా మహత్యముతో లేక శక్తితో కూడుకొని యున్నదని అర్థము. అందువలన "ప్రతి మాట మంత్రమే, ప్రతి ఆకు ఔషధమే"యను నానుడి గలదు. మాట ప్రపంచ సంబంధమైనది కావచ్చును లేక పరమాత్మ సంబంధమైనది కావచ్చును. సృష్ట్యాదిలో ఆకాశ శబ్దము ద్వారా దైవజ్ఞానము తెలియబడినదనీ, అదియే ప్రపంచమునకు మొదటి జ్ఞానమని తెలిసినది.

అదియే దైవికముగా చెప్పిన మొదటి మాటగా మిగిలిపోయినది. ఆ మొదటి జ్ఞానమునే మొదటిగా సూర్యుడు భూమిమీద మనుషులకు తెలియజేశాడు. అదే మొదటి జ్ఞానమునే శ్రీకృష్ణుడు అర్జుననకు చెప్పాడు. అదే మొదటి జ్ఞానమునే ఏసు తన శిష్యులకు చెప్పాడు. అదే మొదటి జ్ఞానమునే జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్త గారికి చెప్పడమైనది. మన అదృష్టవశాత్తూ అదే మొదటి జ్ఞానమే నేడు మనముందర మూడు గ్రంథములుగా యున్నది. మూడు గ్రంథములలో సృష్ట్యాదిలోని దైవజ్ఞానమే యుండుట వలన మూడు గ్రంథములను దైవగ్రంథములనుచున్నాము.

సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానము శబ్దరూపములో బయటికి వచ్చినది. అందువలన మొదటి జ్ఞానమును 'మాట' అని అంటున్నాము. మాట మహత్యముతో కూడుకొనియుండును. ఆకాశము చెప్పిన మాట అనగా చేసిన శబ్దము జ్ఞానముతో కూడుకొనియుండుట వలన అది మహత్యముతో కూడుకొనియున్నది. దానిలోని మహత్యమును తెలుపు నిమిత్తము నేడు మేఘములు శబ్దము చేయుచున్నవి. శబ్దము మహత్తుతో కూడుకొన్నదని తెలుపుటకు శబ్దముతో పాటు ఆకాశములో మెరుపులు గలవు. మెరుపులతో పాటు పిడుగులు కూడా కలవు. ఇదంతా దైవజ్ఞానము ఇంతటి ప్రభావమున్నదని కర్మను దహించు శక్తియున్నదని తెలుపు నిమిత్తమే అలా కలవు. ఏది ఏమయినా మొదట జ్ఞానముగా వచ్చిన శబ్దము తర్వాత కాలములో గ్రంథ రూపముగా మారినది. మొదటి మాట మూడు యుగములు గడచిన తర్వాత శబ్దము పోయి వ్రాత రూప గ్రంథమయినది. అట్లే మొదటి జ్ఞానము మూడు గ్రంథములుగా తయారైనవి. ఆ మూడు గ్రంథములే నేడు భగవద్గీత, బైబిలు, ఖురాన్ అను గ్రంథములుగా యున్నవి. ఒకే జ్ఞానమే మూడు గ్రంథములుగా మారియుండుట వలన, మాకు ఆ విషయము

మొదటినుండి చివరి వరకు తెలిసియుండుట వలన మేము మూడు గ్రంథములను సమానముగా చూస్తున్నాము. సృష్ట్యాదిలో చెప్పబడిన మొదటి జ్ఞానమును మూడు గ్రంథములుగా వ్రాసుకొన్నది మనమే. మనమే అనగా మనుషులే అయినా మనుషులే ఆ విషయమును మరచి పోయి ఒకే జ్ఞానమును మూడు మతములుగా చీల్చుకొని ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క గ్రంథమును గొప్పగా భావించుకొంటున్నారు. ముందు లేని మతములు తర్వాత ఎలా వచ్చాయని ఎవరూ ఆలోచించడము లేదు. గ్రంథముల జ్ఞానమును చెప్పినవారు కూడా మతములని పేరు పెట్టి ఎక్కడ చెప్పలేదు. భగవద్గీత జ్ఞానమును చెప్పిన కృష్ణుడు తన జ్ఞానములో అనగా తన గ్రంథములో మతముల ప్రసక్తే లేకుండా చెప్పారు. మతమునకు సంబంధించిన జ్ఞానము అందులో ఏమీ లేదు. **సర్వ మానవులకు వర్తించు బోధను** భగవద్గీతలో చెప్పారుగానీ, హిందువులకని ఎక్కడా చెప్పలేదు. అదే విధముగా ఏసు చెప్పిన నాలుగు సువార్తలలోని జ్ఞానములో **సమస్త జనులకని** చెప్పారుగానీ, క్రైస్తవులకని ఎక్కడా చెప్పలేదు. క్రైస్తవులు బైబిలు మా గ్రంథము అని అనుచుండినా, వారి గ్రంథమని చెప్పుటకు ఎక్కడా ఆధారములేదు. చివరిగా వచ్చిన ఖురాన్ గ్రంథములో **సమస్త లోక వాసులకు ఇది హితోపదేశము** అని సూరా 81, ఆయత్ 27 లో కలదు. ఖురాన్ జ్ఞానమును చెప్పిన జిబ్రయేల్ తన బోధలో ఎక్కడా ఏ మతమును గురించి చెప్పక సమస్త ప్రజలకని చెప్పడమైనది. అటువంటప్పుడు ఫలానా గ్రంథము, ఫలానా మతముదని మానవులు చెప్పుకొన్నా ఆ మాటను దేవుడు ఒప్పుకోడు. ఎందుకనగా దేవుడు ప్రజలను సమానముగా సృష్టించాడుగానీ మతస్థులనుగానీ, మతములనుగానీ సృష్టించలేదు.

ఎక్కడయితే మతమున్నదో అక్కడ దేవుని జ్ఞానమున్నాగానీ, అందులో శక్తియుండదు. ఎక్కడయితే మతము లేదో అక్కడ గల జ్ఞానమునకు అమితమైన శక్తియుండును. అందువలననే నేడు మతములున్న చోట దైవజ్ఞానమున్నా, దానిలో దేవుని శక్తి లేకుండా దేవుడే చేశాడు. అటువంటప్పుడు వారివద్ద యున్న జ్ఞానము పేరుకు మాత్రమే యుండును గానీ అందులో ఏ శక్తి లేకుండాయుండును. అటువంటి శక్తిలేని జ్ఞానము మనుషుల కర్మలను కాల్చలేదు. అనగా వారి పాపములను వారికున్న జ్ఞానము హరించదు. పాపము క్షమాశీలత లేకుండా పోవుట వలన మనిషికి జ్ఞానము వలన ఉపయోగము ఏమీ లేదనియే చెప్పవచ్చును. మతాలకు అతీతమైన జ్ఞానము ఎక్కడయుంటుందో, అక్కడ జ్ఞానశక్తియుండి వారి పాపములను కాల్చివేయును. దానివలన పాప క్షమాశీలత కలుగునని చెప్పవచ్చును. మతముల ప్రసక్తిలేని జ్ఞానము మూడు దైవగ్రంథములలోనూ గలదు. మూడు గ్రంథముల జ్ఞానము పాపములను లేకుండా చేయు శక్తి కలదైయున్నది. అందులన ఏ మతస్థుడయినా దైవగ్రంథముల ముందర తన మత భావమును వదలివేసి దైవజ్ఞానమును తెలియగలిగితే, వానికి అమితమైన జ్ఞాన లాభము కల్గును. వాని కర్మలు కాలిపోవును.

సృష్ట్యాదిలో చెప్పినమాట కనిపించే మేఘములదయినా అది వాస్తవముగా కనిపించని ఆకాశముదేయని చెప్పవచ్చును. అయితే ఆకాశమే ఆ విషయమును చెప్పిందాయని చూస్తే, ఆకాశము కూడా ఒక భూతమగుట వలన ఏ భూతము (ఏ జీవుడు) ఏ కార్యము చేయలేడను శాస్త్రబద్ధమైన సూత్రము ప్రకారము, ఆకాశము కూడా స్వయముగా జ్ఞానమును చెప్పలేదు. అయితే సృష్ట్యాదిలో జ్ఞానము ఆకాశము చేత చెప్పబడినది అని దేవుడే స్వయముగా చెప్పుట వలన దేవుడు అసత్యమును

చెప్పాడా? అను ప్రశ్న రాగలదు. ఇక్కడ సత్యమును చెప్పుకొంటే జీవుడు ఎలా ఏ పని చేయలేదో అలాగే దేవుడు కూడా పని చేయువాడు కాదు. జీవుడు చేయలేడు, చేతకాదు. దేవుడు చేతనయినా చేయడు. ఏ కార్యమును ఇటు జీవుడుగానీ, అటు దేవుడుగానీ చేయడు. అయితే ఆకాశము చెప్పిందని చెప్పని ఆకాశము మీద చెప్పింది ఎవరు? అను ప్రశ్న రాగలదు. దానికి సమాధానముగా ఎవరికీ తెలియనివాడు, అందరిలో అణిగియున్నవాడు, అందరి వెనుకయుండి అందరినీ ఆడించువాడు, అన్నీ తానే చేయుచున్నా తనను ఎవరూ గుర్తు పట్టనట్లు అందరిలో యుండి చేయువాడు, యత్న మొనరించు యోగులకు తప్ప ఎవరికీ తెలియనివాడు ఒకడున్నాడు. అతనే సృష్ట్యాదిలో అటు దేవున్ని, ఇటు మహాభూతమైన ఆకాశమును అడ్డము పెట్టుకొని జ్ఞానమును చెప్పాడు. ఒకమారు చెప్పిన ఆయన మాట శాశ్వితముగా నిలిచిపోయినది. అప్పుడు ఆయన చెప్పిన జ్ఞానమే ఇది అని ఎవరూ తెలియనట్లు దానినే మూడు దైవగ్రంథములుగా చేశాడు. అప్పటికి కూడా తనను ఎవరూ గుర్తించనట్లు, తాను చెప్పిన జ్ఞానమును తెలిసిన తర్వాత ఎవరి దృష్ఠి తనమీదకు రానట్లు ఎవరినీ వదలకుండా, కనీసము ఒక్కనిని కూడా వదలకుండా మతము అను మూడు వలలలో మనుషులను చిక్కుకొని దానినుండి బయటపడనట్లు చేశాడు. అందువలన సృష్ట్యాదిలో చెప్పిన ఒకరు, ఒకమారు, మాటల సమూహముగా చెప్పిన ఒక జ్ఞానమే మూడు గ్రంథములుగా తయారైనదని గుర్తించలేక పోవుచున్నాము. ఇప్పటికయినా ఇప్పుడు మేము చెప్పిన ఈ పెద్ద రహస్యమును గ్రహించి మూడు గ్రంథములలోని జ్ఞానమును ఒకే మాటగా గుర్తించి చేతయినతే ఎవరికీ తెలియనివాడిని, మూడు గ్రంథముల మాటను చెప్పిన వానిని కనుగొనండి చూద్దాము. నా మాటను రోషముతో చూడండి, మీ వెనుక అణిగియున్న వానిని వెతకండి.

**ప్రశ్న :- మీరు ఎంతో గొప్పగా చెప్పారు. అయితే ఇదంతయూ విన్న తర్వాత కూడా మాలో చిన్న అనుమానము ప్రశ్నగా మిగిలియున్నది. చివరిగా దానిని అడుగుచున్నాను. దయచేసి జవాబును చెప్పండి. సృష్ట్యాదిలో ఆకాశము మేఘముల ద్వారా జ్ఞానమును ఉరుముల ద్వారా చెప్పినదని నమ్ముచున్నాము. అయితే మేఘములుండునది ఆకాశములోనే అయినా భూమికి కొద్ది ఎత్తులోనే ఉండును. సూర్యుడు ఆకాశములో కొన్ని లక్షల మైళ్ళ దూరములో మేఘముల శబ్దము వినిపించనంత దూరముగా యుండును. మేఘములు భూమికి దగ్గరగాయున్నవి కావున మేఘముల శబ్దము భూమిమీద మనుషులకు వినిపించవచ్చును. మేఘములు ఎంత పెద్దగా శబ్దము చేసినా ఏమాత్రము వినిపించనంత దూరములో సూర్యుడుండుట వలన ఆకాశ మేఘములు చేసిన శబ్దమును ఎలా వినగలిగాడు? అందులోని జ్ఞానమును ఎలా తెలియగలిగాడు? ఎలా చూచినా మేఘముల శబ్దము వినే అవకాశమే సూర్యునకు లేనప్పుడు మేఘముల ఉరుములలోని జ్ఞానమును ఎలా తెలియగలడు? అని ప్రశ్న ఎవరికయినా రాగలదు. ఈ విషయమును గురించి కొంత వివరముగా తెలియజేయగలరని అడుగుచున్నాము.**

**జవాబు :-** మనుషులు, దేవతలు దేవుని చేత సృష్ఠించబడినారు. అలాగే దేవుని పాలన సాగుటకు భూతములు, మహాభూతములు, గ్రహములు, మహాగ్రహములు అను మిగతా రెండు జాతులను కూడా దేవుడు సృష్ఠించాడు. దేవుని సృష్ఠిలో మనుషులు, దేవతలు ఒక భాగము కాగా, భూతములు, గ్రహములు మరియొక భాగముగా యున్నవి. దేవతలకు మనుషులకంటే కొంత ప్రత్యేకమైన జీవితమును దేవుడు కలుగజేశాడు.

మనుషులకు స్థూల శరీరములున్నట్లు దేవతలకు రాతి ప్రతిమలు, సిమెంటు బొమ్మలు స్థూల శరీరములుగా గలవు. మనిషి తన స్థూల శరీరమును ఒకమారు వదలితే దానిని 'మరణము' అంటాము. జీవుడు (మనిషి) శరీరమును వదలి బయటికి వస్తే తిరిగి దానిలో చేరలేడు. అదే దేవతలయితే రాతి విగ్రహమునుండి బయటికి రాగలరు, తిరిగి లోపలికి పోగలరు. రాతి శరీరము స్థూల శరీరముగా యుండుట వలన దేవుడు అటువంటి సౌకర్యము కలుగజేశాడేమో చెప్పలేము. ఒక దేవత తన స్థూల శరీరమైన విగ్రహము నుండి ఒక రోజులో ఎన్నిమార్లయినా బయటికి రాగలదు, తిరిగి లోపలికి సులభముగా పోగలదు. ఆ విధముగా మనిషి అయినవాడు చేయలేడు. మనిషి ఒకమారు శరీరములో ప్రవేశిస్తే 'జన్మ' అంటాము. ఒకమారు శరీరమునుండి బయటికి వస్తే 'మరణము' అంటాము. ఈ విధముగా దేవతలకు, మనుషులకు వ్యత్యాసముండును.

దేవతలు, మనుషులు ఇద్దరూ కర్మజీవులే అయివుండుట వలన కర్మకు లోబడి కష్టసుఖములను అనుభవిస్తూ బ్రతుకుచుందురు. వారు కర్మబద్ధులై తమ జీవితమును తాము గడుపుచుందురు. అయితే మనుషులు దేవతలను వారు తమకంటే గొప్పవారని భావించి, వారికి గుడులు కట్టి పూజించడము జరుగుచున్నది. మనుషుల బలహీనతను, అజ్ఞానమును ఆసరాగా చేసుకొని దేవతలు మనుషులను బెదిరించుచూ, భయపెట్టుచూ అక్రమముగా పీడించుచూ, అనవసరముగా వేధించుచూ ప్రజలను తమ వశులుగా చేసుకొని వారిచేత గొప్పగా పొగిడించుకోవడము, పూజలు చేయించుకోవడము చేస్తున్నారు. ప్రజలు దేవతలనే గొప్పగా తలచి తమను సృష్టించిన దేవున్ని మరచిపోయి దేవతలనే గొప్పగా భావించి పూజించు

చున్నారు. దేవతలు కూడా ప్రజల మీద తమ పెత్తనమును చెలాయిస్తూ తమను తాము పెద్దగా తలచుకొని విర్రవీగుచూ తమను సృష్ఠించిన దేవున్ని పూర్తిగా మరచిపోయారు. మనుషులు, దేవతలు ఇద్దరూ పూర్తి అజ్ఞానములో పడిపోయి మనుషులు దేవతలను పూజించగా, దేవతలు మనుషులకంటే గొప్పవారమను అజ్ఞానములో పడిపోయారు. ఇది దేవుడు సృష్ఠించిన కర్మ సంబంధ సృష్ఠిలోని దేవతల, మనుషుల పనియైయున్నది.

ఇకపోతే కర్మ లేకుండా సృష్ఠింపబడిన జీవులు కొందరుగలరు. వారే భూతములు గ్రహములుగా చెప్పబడుచున్నారు. వీరికి కర్మలేదు, కర్మ సంపాదించరు. దేవుడు నియమింపజేసిన పనిని మాత్రము చేయు చుందురు. దేవుని పరిపాలనలో కాలమును గడుపుచుందురు. జీవుల చావు పుట్టుకలు, జీవితములు మొదలగు పాలనా విధానమంతయూ వీరు చేయుట వలన జరుగుచుండును. ఒక విధముగా గ్రహములు, భూతములు దేవునికి దగ్గరగాయుండి దేవుని ఆజ్ఞ ప్రకారము నడుచుచుందురు. భూతములకు గ్రహాలకు కూడా శరీరములు గలవు. అయితే కొందరి శరీరములు మనిషి కంటికి కనిపించునవిగా ఉన్నాయి. కొన్ని శరీరములు మనుషులకు కనిపించకుండా ఉన్నాయి. ఇప్పుడు మనము చెప్పుకొను సూర్యగ్రహము గానీ, ఆకాశ భూతముగానీ వేరువేరు తెగలవయినా, ఒకటి భూతమయినా, మరొకటి గ్రహమైనా రెండిటికీ శరీరములు గలవు. ఆకాశము స్థూల మరియు సూక్ష్మముగాయుంటూ కనిపించీ కనిపించకయున్నది అదే సూర్యగ్రహము కనిపించు శరీరము గలదియైయున్నది. సూర్యుని శరీరము మండే గోళముగాయుండగా, ఆకాశము యొక్క శరీరము కదిలే మేఘములుగా యున్నది. గ్రహమైన

సూర్యుడు, భూతమైన ఆకాశము రెండూ జీవులే అయినా ఏ దాని శక్తి దానిదే, ఏ దాని పని దానిదే. గ్రహములు గానీ, భూతములుగానీ కర్మప్రకారము నడువునవి కావు. అందువలన అవి ఒకదానికొకటి ఘర్షణ పడవు, స్నేహము చేయవు. వాటి మధ్య ప్రేమ, ద్వేషము అను గుణములకు తావే ఉండదు. రెండూ దేవుని సేవ నిమిత్తమై ఉండునవే.

దేవుని పాలనలో భాగముగా భూతములుగానీ, గ్రహములుగానీ తమ స్థానములను వదలి ఇతర స్థలములకు పోవలసియుంటుంది. అదే విధముగా తమ శరీరములను వదలి సూక్ష్మముగా కనిపించకుండా కూడా ఇతర జాగాలలోనికి, ఇతర మండలములలోనికి పోవలసి యుంటుంది. దేవుని కార్యములను నెరవేర్చు నిమిత్తము గ్రహములుగానీ, భూతములుగానీ, నక్షత్రముల సమీపము వరకు పోయివచ్చిన సందర్భములు గలవు. అయితే ఈ విషయములు ఎటువంటి ఖగోళ శాస్త్రజ్ఞులకు ఏమాత్రము ఇంతవరకు తెలియవు. భూమిమీద దేవతలు తమ రాతి శరీరములను వదలి బయటికి రావడము తిరిగి లోపలికి చేరడము ఎలా జరుగుచున్నదో అదే విధముగా గ్రహములు, భూతములు చేయుచున్నవి. ఆకాశములో ఈ విధముగా జరుగుచున్నదని మనము తెలియుటకే దేవతలకు అటువంటి సౌకర్యమును దేవుడు కలుగజేశాడేమో అనిపిస్తున్నది.

కర్మ విధానములో బంధీలైయున్న మనుషులకు ముందు ఏమి జరుగునో తెలియదు. అదే గ్రహములు, భూతములు కర్మ బంధములో లేకుండాయుండుట వలన వారికి కొన్ని గంటలముందు జరుగబోవు విషయములను తెలియగలవు. సృష్ట్యాదిలోనే తమ కర్తవ్యమును సక్రమముగా

నెరవేర్చు సూర్యుడు ఆకాశములోని మేఘముల ద్వారా జ్ఞానము చెప్పబడుచున్నదని తెలిసి, మేఘములు భూమికి దగ్గరగా జ్ఞానమును తన శబ్దము ద్వారా చెప్పుచున్నవని తెలిసి, భూమిమీదున్న మనుషులు మేఘముల శబ్దమును వినినా గ్రహించలేరని తలచి, మొదట తాను మేఘములు చెప్పు జ్ఞానమును విని తర్వాత ప్రజలకు తెలియజేయగలనని తలచి, అదే పనిగా ఆకాశములో సుదూరమునయున్న సూర్యుడు తన స్థూల దేహమయిన అగ్ని గోళమును వదలి, భూమిమీద భూమికి సమీపమునయున్న మేఘముల దగ్గరకు రావడము జరిగినది.

ఇదంతయూ సృష్టి ప్రారంభమయిన ప్రభవ సంవత్సరములోనే జరిగినది. అనగా సృష్టి ప్రారంభమయిన సంవత్సరములోనే దేవుడు ఆకాశ వాణి ద్వారా తన జ్ఞానమును చెప్పించాడు. ఖచ్చితముగా చెప్పలేముగానీ, ఆకాశము మేఘముల ద్వారా జ్ఞానము చెప్పడము సృష్టి అనంతరము ఐదవ నెలలో జరిగిందని చెప్పవచ్చును. ఎప్పుడు జరిగిందనునది ముఖ్యము కాదుగానీ, ఏమి జరిగిందనునదే ముఖ్యము. మేఘముల ద్వారా జ్ఞానము తెలియబడునని తెలిసిన సూర్యుడు, భూమి సమీపమునకు వచ్చి మేఘములు ఉరిమి చెప్పిన శబ్దమును గ్రహించి, తిరిగి ఆకాశములోని తన స్థూల శరీరమును చేరి, కొన్ని సంవత్సరములు జ్ఞానమును నెమరువేసుకొని తనకు సమీపమున యున్న గ్రహములకు, భూతములకు మేఘములు చెప్పిన మొదటి జ్ఞానమును తెలియజేయడము జరిగినది. అలా సూర్యుని వలన నక్షత్రమండలము వరకు దైవజ్ఞానము ప్రాకినది. అనేక గోళములకు దైవజ్ఞానమును సూర్యుడు చేరవేశాడు. ఆ విధముగా విశ్వమంతా భూతములకు, గ్రహములకు దైవజ్ఞానము తెలిసిపోయినది.

తర్వాత కొంత కాలమునకు భూమిలోని ప్రజలకు మొదటి గురువుగా సూర్యుడు వచ్చి మనువు అను వ్యక్తికి దైవజ్ఞానమును చెప్పడమైనది. సూర్యుడు మొదట భూమిమీద జ్ఞానమును తెలిపినది భారతదేశములోనే. భారతదేశములో ప్రత్యేకించి దక్షిణ భారతమునగల మనువుకు తెలుగు భాషలోనే జ్ఞానమును చెప్పడమైనది. అందువలన ఎప్పటికయినా జ్ఞానమునకు పుట్టినిల్లు దక్షిణ భారతదేశము. పుట్టిన భాష తెలుగు భాషయని చెప్పవచ్చును. భూమిమీద జ్ఞానము లేకుండా పోయినా, ధర్మములు అడుగంటిపోయినా, భారతదేశములో మాత్రము అదియూ దక్షిణ భారతమున ధర్మములకు క్షయము లేదు. దైవజ్ఞానమునకు లోటు లేదు అని చెప్పవచ్చును. సృష్ట్యాదిలో భూమికి దగ్గరగా యున్న మేఘములు భారతదేశమున దక్షిణమున గల ప్రాంతములోనే ఉరుముల రూపములో ఉరమడము జరిగినది. సూర్యుడు దక్షిణ భారతదేశమునకు దగ్గరగా వచ్చి జ్ఞానమును విని పోయాడు. అందువలన తిరిగి దక్షిణ భారత దేశమున గల మనువు అను మనిషికి తెలుగు భాషలోనే జ్ఞానమును చెప్పి పోవడము జరిగినది. ఇప్పుడు నీ ప్రశ్నకు జవాబు దొరికిందనుకుంటాను. నీకు ఇంకా ఏదయినా అనుమానముంటే అడుగవచ్చును.

**ఇట్లు**

## ప్రబోధానంద యోగీశ్వరులు



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# ఒక మాట
# మూడు గ్రంథములు



త్రిమత ఏకైక గురువు

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org